శ్రీరస్తు.

# సుశీలనాటకము.

దోణంరాజు సీతారామరాయ విరచితము.

ప్రకటనకర్త:

దోణంరాజు సీతారామారావు,

మచిలీపట్నము.

894-8132 SEE

మచిలీపట్నము

సేతు ముద్రాక్షరశాలయందు

సి. సేతుమాధవరావుచే ముద్రింపఁబడియె.

1910.

స. 143

వెల రు 0—8—0.

కాపీరైట్] [రిజిస్టర్డు



శ్రీమంత్ కుమారరాజా యేర్లగడ్డ అంకినీడ్రప్రసాద బహద్దరు
బి. యే. గారు:— దేవరకోట.

**This little book**

**Is most respectfully**

**DEDICATED**

**To**

M. R. Ry. Sreemanth Raja Yarlagadda Ankinid Prasada Bahadur B. A., Kumar Raja of Devarakota

*By*

*THE AUTHOR.*

# పీఠిక.

కవిశిరోమణులారా!

ఈ సుశీల నాటకము 1910 సం॥ మెట్రిక్యులేషను పరీక్షాపఠనీయ గ్రంథంబులో సుశీలయను కథ ననుసరించి నాటకానుకూలంబుగ కొన్నిమార్పులు జేసివ్రాసినాఁడ. శాస్త్రంబేమియు నభ్యసించక కేవల పండితుల సహవాసంబునంజేసి లభించిన నించుకజ్ఞానంబుచే రచించుటచేతను, నాటకరచనకిదియే ప్రథమ ప్రయత్నంబగుటచేతను, నిం దనేకతప్పులు కుప్పలుగాఁబడియుండు. కావున నాయందు సోదరవాత్సల్యమును బూని తప్పులు మన్నింప మీశిష్యప్రశిష్యుండనై ప్రార్థింతు.

"ఉ॥ అచితులైన వారలిది – యారసి యీరసమున్ గ్రహించిలా।
లించినఁ జాలుకొందరవి – లేవివి లేవని గేలిసేయువా।
రంచు రచించమానుదుమె – యందరినిన్ దనియింపమమ్మని।
ర్మించిన బ్రహ్మకైనఁ దర – మే యిదిపెద్ద లెఱుంగకుందురే॥"

అనుశ్రవణానంద గ్రంథకారుల వాక్యంబును మనంబుననుంచమీరెల్లరు ప్రార్థితులు—

సోదరీమణులారా!

ఇది సుశీలయను కాంత ధనపాలుఁడను వైశ్యునిచేతను, కిరాతులచేతను తనమానభంగము గాకుండఁ గాపాడుకొనినకథ. విచారించి చూడ యిందొక్కింత నీతియున్నదని నానమ్మిక. ఇదిమీరును జదువదగినదే.

నాటకులారా!

దీనిని రంగస్థలంబున కనుకూలముగ నే వ్రాసినాఁడ. మీకర్థంబు గాని కష్టపదంబు లెచ్చటను గుప్పలేదు. తక్కిన నాటకంబుల వలెనే నిదియు బ్రదర్శింప యోగ్యమగునేని ప్రదర్శించి నన్నానందాబ్ధిని నోల లాడ్పుడు. శ్రీమత్కింక వీంద్రఘటా పంచానన విద్వత్కవి బాలక ళానిధి బాలసరస్వతీ శతావధానీత్యాది బిరుదావళీ విరాజమానులగు బ్రహ్మశ్రీ తిరుపతి వెంకటేశ్వర కవులు నాయందు పుత్రవాత్సల్యము బూని యీపాత్రంబునం దుండు తప్పులు వీలగునంతవరకు సవ రించినందున కెంతయు కృతజ్ఞతాపూర్వకముగా వందనశతంబులర్పించు వాఁడ. ఈనాటక కృతికర్తలగు మహారాజ రాజశ్రీ శ్రీమత్కుమార రాజా యేర్లగడ్డ అంకినీడ్ ప్రసాద బహద్దరు బి. యే. గారవారిని శ్రీకృష్ణుండు' చిరంజీవులుగాను సమస్తవాంఛితార్థ సమృద్ధులు గాను నొనరించుఁగాత' యని యింతట విరమించుచున్నాఁడ.

ఇట్లు విధేయుఁడు,

ద్రోణంరాజు సీతారామారావు.

పలయువారు:—

ద్రోణంరాజు సీతారామారావు,

గొడుగుపేట, మచిలీపట్నం.

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు.



పురుషులు.

వత్సరాజు— సత్యపురాధీశ్వరుడు. — (కథానాయకుడు)

గోపాలవర్మ— విజయధామ పురాధిపతి.

విశారదుడు— గోపాలవర్మ పుత్రుడు.

ధీమణి— మంత్రి.

సుబుద్ధి— ధీమణి పుత్రుడు.

కమలాప్తుడు— (సుశీల పురుషాకారంబున గోపాలవర్మసభకు వచ్చి నప్పుడు ధరించిన నామము)

ధనపాలుడు— సుశీలను వంచించి తనగృహంబునకుఁ దీసికొని పోయిన వైశ్యుడు.

రామన్న, భీమన్న — కిరాతులు.

స్త్రీలు.

సుశీల— కథానాయిక.

భారతి, చారుమతి, ప్రియంవద — చెలికత్తెలు.

# తప్పొప్పులపట్టిక.



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 21 | విభుదా | విబుధా |
| 8 | 5 | నె | నే |
| 13 | 6 | జో | ఓ |
| 15 | 8 | పతిహి | పతిహిత |
| 16 | 18 | సుశిల | సుశీల |
| 39 | 1 | | (గవయబోవుచున్నాడు) |
| 40 | 9 | బా | బా[illegible] |

శ్రీరస్తు.

# సుశీల నాటకము.

నాంది.



శ్రీ రాజిల్లెడు కృష్ణుపైని నదలో జెన్నొందు సత్ప్రేమనిం।
పారన్ దెల్పఁగ నవ్వుమోముపయి నీ కా కస్తురిన్
బెట్టెదన్। రారాయంచును బిల్చి ముద్దుగొను శ్రీ
రాధాసతిన్ కౌఁగిటన్। జేరందీసెను కృష్ణమూర్తి
శుభ దృష్టిన్ గాంచుతన్ సభ్యులన్॥

అతివిస్తరంబేటికి? పారిపార్శ్వకా! నీవొకసారి యిటురమ్ము.

పారిపార్శ్వకుడు (ప్రవేశించి) అయ్యా! యేమి సెలవు?

సూత్ర. ఈ సభ్యులు నన్నుబిలిచి నూతనంబైన నీతిసంయుతంబగునాటకంబొండు ప్రదర్శించి మమ్ముల నానందాబ్ధిని నోలలాడ్పుమని యాజ్ఞాపించిరి. ఇందుకు నీవును సహాయ భూతుండవగుదువని పిలిచితి.

పారి. అయ్యా! యేనాటక ప్రదర్శనంబున వీరి నానందింపజేయ నెంచితిరి.

సూత్ర. సఖా! శ్రీమదిందిరారమణ చరణారవిందనిష్యందమాన మరందపాన మత్తేందిందిరాయమాణ సన్మానసుండని భక్తులెవ్వానిని బొగడుచుందురో, యాచకజన చకోరచంద్రుడని దీనజనంబులెవ్వానిని జేర నెంచుచుందురో, సంస్కృతాంధ్రాంగ్లేయ విద్యావిరాజమానుండనియు, కవిజనహృదయ సరసీరుహ భాస్కరుండనియు పండితులెవ్వాని యఖండయశంబును సర్వదిక్కులను జాటుచుందురో, యట్టి శ్రీమ ద్దేర్లగడ్డ వంశక్షీర పాథోరాసి పూర్ణక్షపాకరుండు, బాంధవరక్షణ నిధానుండును, సకలదీనలోక సౌఖ్యాన్వేషణ తత్పరుండును, దేవరకోట జమీం పరిపాలకులగు శ్రీమతు రాజా మల్లిఖార్జున వరప్రసాదధరా పురంధరపుత్రుండునునగు శ్రీమత్కుమారరాజా అంకినీడ్ప్రసాద నాయఁడు బహద్దరు బి. యే. దొరవారిచే ,కృతిపొందఁబడిన సుశీలయను నాటకం బెఱుంగవా!

పారి. అయ్యా! వింటినికాని గ్రంథకర్తనామంబు మాత్రము మఱచినాను. దయఁబూని సెలవిండు.

సూత్ర. వెఱ్ఱివాఁడా! నాటకప్రదర్శనము బాగున్నదా లేదా యని సభ్యులు విమర్శింతురుకాని గ్రంథకర్త నామంబుతో పని లేదు. అయినను నీవు కోరితివికాన తెల్పెద.

శా॥ నానాదిక్తటగేయ కీర్తియగు ద్రో ♦ ణంరాజ వంశోద్భవుం
డౌ నారాయణరాయనందనుఁడు శ్రీ ♦ శాంఘ్రిద్వయీభక్తి సం
ధానుండుర్వి విబుధానువర్తనుఁడు సీ ♦ తారామనామాంకు డెం
తో నైపుణ్యత వ్రాసె సత్కవులు సం ♦ తోషింప స్వాంతంబులన్॥

ఇక మనమేగి యీనాటక ప్రదర్శనమునకుం దగిన పాత్రములను సిద్ధముజేతము రమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

(ఇది ప్రస్తావన)







శ్రీ

# సుశీలనాటకము.

## ప్రథమాంకము.

(ఉద్యానవనము:— సుశీల వత్సరాజు రూపపటంబు హస్తంబు నందుంచుకొని ప్రవేశించుచున్నది)

సుశీల— నిన్నటిదినంబున పూర్ణిమయైయుండియు క్షపాకరుం డెందు చేతనోగాని ప్రకాశింపలేదు. (ఆలోచించి) సరే తెలిసినది. (పటంబునుజూచి)

మ॥ సరసాలోకన హాసభాసురవిలా ♦ సస్ఫూర్తిదీపించు సుం
దరమౌనీని మొగంబుజూచి శశిచి ♦ త్తంబందు శంకించి నా
వరసౌందర్యమికేలయంచును గడుఀ ♦ భావించి మేఘుంబుగా
సెరహిఀ; వత్సధరాధినాయకుని గీ ♦ ర్తింపంగ శక్యంబొకో॥

ఆహా! ఏమి యీతని సౌందర్యము!

మ॥ మొగమా వెన్నెల గుత్తినిండెగడెడుం ♦ బోల్పంగవాల్గన్నులుఀ
నగుపద్మంబుల సౌరు కుంతలములౌ ♦ న్నం బోలునీలంబులఀ

సొగసా బాహుబలతీరు గేరుసవురా ♦ కుండలాల తుండంబుకీ
సుగుణుల్ వర్ణనజేయ శక్యమగునే ♦ జూడంగ నిద్ధాత్రిలోకీ॥
ఇదిగదా నాభాగ్యము.

ఉ॥ భూతలనాథ మౌళిమణి ♦ పూజితపాద సరోరుహుండు వి
ఖ్యాత గుణాకరుండుఁ ద్రిజ ♦ గన్నుతవీరుఁడుఁ శౌర్యశాలి సం
పూత చరిత్రుఁ డార్యజన ♦ భూషణుఁ డింద్రసమాన భోగుఁ డే
సీతని బెండ్లియాడమది ♦ నెంచుట నాదగు పూర్వపుణ్యమే॥

ఈవత్సరాజు నాతండ్రికి శత్రుండనుమాట నెఱుంగక నే నీతనిఁ గోరితి. అందుకు మాతండ్రి దండతాడిత మహోరగంబుకరణి నుండి పడుచు వత్సరాజును రాజ్యభ్రష్టుని జేసెదనని నుడివె. (ఇంచుక యూరకుండి) అక్కటా! నాపైనింత కినియుటకు నేనేమి నేరముచేసి తినోకదా! ఎంత విచారించి చూచినను నావల్ల నేరంబేమియు గాను పించదు. (ఆలోచించి) ఔను, నేనేదో చెడునక్షత్రంబున జన్మించితి ననియు, నందుచేత నన్ను బెండ్లాడు ధరణీధవుండు రాజ్యభ్రష్టుఁడై యడవులఁ గడునిడుమలఁబడి క్రమ్మరరాజ్య సుఖంబుల నందుననియు వింటినిగదా. ఇదియే వారికిఁ గోపకారణమై యుండును. వత్సరాజు నాతండ్రికి శాత్రవుండైనను, నాకు భర్తకాఁగానే యల్లునియందుజూపు మర్యాదకునయినను వానితోఁ బగసాధింపకుండ నుండఁడా. ఏమైనను సరే. నామనంబా వత్సరాజునందే చిక్కినది. నందనందన పాదార విందమకరందరస పానమత్తేందిందిరాయమాణ సన్మానసనగు నాకేమి భయము,

భార‌తి—— (ప్రవేశించి) చెలీ! సుశీలా! సత్యపురాధీశ్వరుండగు వత్సరాజు ను బరిణయ మాడుమనను గర్వంబుచేతనా నన్నుబిలువకుండ వనవిహారంబున కొంటరిగ వచ్చితివి.

సుశీ—— చెలీ! కినియకుము.

భార. తే॥గీ॥ వత్సధరణీశ్వరుండు నీకు ♦ భర్తయగుట
నీదు పూర్వపుణ్యమునమ్మ ♦ నిక్కముగను
నతనిబోలు భూపాలుడీ ♦ యవనిలేడు
జూడ నెంచైనను సుశీల ♦ సుగుణలోల॥

కాని యితని నల్లునిగాఁ జేకొనుటకు నీతండ్రికి మిక్కిలి కోపము గా నున్నట్లు చారుమతివలన వింటిని.

సుశీ—— అవును, నిజముగాఁ గోపముగనే యున్నాఁడు. ఆకోపముతో నే వత్సరాజునకు వివాహపత్రికం బంపె.

భార—— సఖీ! ఆయనకేల కోపముఁ దెప్పించితివి? పోనిమ్ము! వే రొక్కవరుని గోరకపోతివా?

సుశీ—— మనంబున జిక్కినవరుని విడిచి వేరొకనిని జేపట్టుట పతివ్రతలకు లక్షణంబుగాదు. (భారతి దిక్కై) నీహస్తంబులోనున్న వవి యేమి?

భార—— ఇవి మనరాజుగారివద్దకు వచ్చిన రాజకుమారుల పటంబులు. వీనిని జూచుటకై నీమందిరంబున నుండగాఁ దీసికొనివచ్చితిని.

సునీ— ఇవియా! వీటినినన్నిటిని తండ్రిగారు నావద్దకుఁ బంపి యిందు నీ యిచ్చవచ్చినవానిని బెండ్లియాడుమని చెప్పిరి. వీటినన్నిటినిఁ జూచి చిత్రపటంబునఁజూచిన రూపమే తెలియునుగాని సుగుణ సంపదలు తెలియవని చింతించి యెట్టకేలకు ధైర్యం బవలంబించి యీవత్సరాజును బెండ్లియాడుదునని చెప్పితి. వత్సరాజు తండ్రిగారికి శత్రువనిగాని యీతఁడే వత్సరాజనిగాని నాకు మొదటఁ దెలియలేదు. తరువాతఁ దండ్రిగారివలనఁ దెలిసినది. (ఇంచుక యూరకుండి) సఖి! వత్సరాజు కడుమాన్యుండనివిందు. నిజంబేనా?

ధార— సందేహమేమి.

ఉ॥ నిండుమనంబు సూనృతము ♦ నీతియుధర్మము గల్గి కీర్తివం
తుండయి పుణ్యకార్యముల ♦ తోఁదులఁదూఁగుచు ధీరుఁడైన భూ
మండల నాయకుల్ మిగుల ♦ భక్తినిగొల్వఁగ రాజ్యమేలునా
చండహిమాంశు తేజుఁడు ల ♦ సచ్చరితుండగు వత్సరాజలన్॥

ఉ॥ ధర్మ మధర్మముల్ దెలిసి ♦ ధారుణినెల్ల ప్రజల్ స్వకీయ
సత్కర్మములన్ మనంబులను ♦ గన్గొని సౌఖ్యముఁజెందునట్లు దా
నిర్మలి రాజ్యమేలు సన ♦ యంబును నీశ్వర పాదభక్తిచే
నిర్మల మానసుండు ధర ♦ ణీపతిరత్నము వత్సరాజిలన్॥

కం॥ ముడుపవఁడు పరద్రవ్యంబును
విడువఁడు రక్షింపుమంచు ♦ వేఁడినవీరుల్

నడువఁడు గురునానతివిడి
పలుపలుకు లిఁకేల చెప్పు ♦ వలెను సుశీలా॥

తే॥గీ॥ ఆడితప్పుటెఱుఁగఁ డించు ♦ కైనఁగాని
“సత్యమేవ జయతి”యను ♦ సరణియతని
యొద్దనేగాని మఱెవరి ♦ యొద్ద లేదు
నొక్కిచెప్పెదునీమాట ♦ నిక్కముగను॥

సుశీ— (తనలో) నాపూర్వపుణ్యంబునఁగాదే యీతనిని నేఁ గోరుట!

భార— చెలీ! లోకంబునందు సామాన్యముగా

మ॥ ధనమా కానఁగరాదు గల్గినను వి ♦ ద్యా చూడఁగాసున్న, యా
ధనవిద్యల్ గలుగన్ భుజాబలము బ ♦ ద్ధంబౌను వీక్షింపఁగా
ధనవిద్యాబలమున్న సుందరత త ♦ థ్యంబొప్పఁగా నుండ దా
ధనవిద్యాబల రూపముల్ గలుగు భ ♦ ర్తన్ గాంచ సామాన్యమే॥

ఈ వత్సరాజునకో!

మ॥ ధనమాయుండెను రూపమా కలిగె వి ♦ ద్యా చూడఁగా మెండుయా
ఘనబాహాబల శౌర్యమా గలిగె స ♦ త్కల్యాణ చారిత్రుఁడీ
తనితోఁ బోలఁగలేరు చెప్పితిని త ♦ థ్యంబొప్పఁగా భూమినే
జనపాలాగ్రగణులైనను సుగుణసం ♦ జాతా సుశీలాగనన్॥

సుశీ:— సఖీ! నీవాతనిసంగతిఁ జెప్పుచుండఁగా వత్సరాజు నాముం
దున్నట్లేయున్నది. (పటంబును జూచి)

ఉ॥ ఈనవమోహనాంగుని మ ♦ హీధవచంద్రుని బూర్ణచంద్రబిం
బాననుఁజిత్తచోరుని మ ♦ హాగుణవంతుని వత్సరాజునిన్
మానక పెండ్లియాడెడి స ♦ మంచిత భాగ్యమెకెన్నఁడబ్బునో
మానసమందు నీవిపుడు ♦ మానినిచూచివచింపు మింపుగన్॥

ధార—— సఖి! యీలీల బేల్వై సన్నడిగెద వేల? వివాహ ప్రయత్నం
బులు జరుగుచుండెను. వత్స భూపతికివివాహపత్రిక పంపఁబడెను.

సుశీ మ॥ జనకుండంపిన పత్రికంగని మహా ♦ సంతోషమేపారఁగా
నను బెండ్లాడగవచ్చునో తలపగన్ ♦ శతృక్షమాధీశుఁడీ
తని పుత్రీమణిఁ బెండ్లియాడనని చి ♦ త్తంబందు శంకించునో
మనమందేమియుదోచదయ్యె చెలియా♦మద్భాగ్యమెట్లున్నదో॥

(తనలో వత్సరాజునుద్దేశించి) ఓ వత్సధరాధినాథా! నా
తండ్రికి శాత్రవుండవని యైనను దలంపక నిన్నే కోరితి.

మ॥ నినువాంఛించితి నీదురూపమునెహృ ♦ న్నిరేజమందుంచితిన్
వినుతిన్ జేయుచునుంటినీగుణములే ♦ విఖ్యాతినింబొందఁగన్
ఘనకారుణ్యకటాక్ష వీక్షణసుధా ♦ కల్లోలపాథోధివై
ననుఁగైకొమ్ముమనంబులోఁ దలఁపకన్♦శత్రుత్వమున్ భూవరా॥

(దైవము నుద్దేశించి) ముకుందా! ఆవత్సభూపాలుఁడు నాజన
కుఁడు పంపిన వివాహపత్రికఁ గనఁగానే నన్నుబెండ్లాడసమ్మ
తింపఁజేయు భారము నీ భుజస్కంధమునందు బెట్టితిని. దాసు
రాల నెట్లుచేసినను సరే.

భార — చెలీ! యెంత సేపిచ్చట నుండుట. ఇంచుక సేపావైపునకుఁ బోయి విహరింతము రమ్ము. (నడచుచున్నారు)

భార — సఖి! సుశీలా! విరహిణీజనంబుల వేపుటకై మేనల్లుండగు మన్మథునకు సాహాయ్యం బొనర్పఁ జంద్రుఁడు వెన్నెల గాయుచుండెనాయనునట్లు నెల్లెడనల్లి బిల్లిగ నల్లుకొన్న మల్లెపందిరులక్రిందఁ బడిన మల్లెమొగ్గలును, ఘుమ్ముఘుమ్మని కమ్మని తెమ్మెరల నొసంగు జాజిపుష్పంబులును, కందర్పుని హస్తంబున నుండెడు బాకులోయనందగు కేతకీపుష్పములును, డెందంబుల కానందంబు గల్పించు మందార సుమబృందంబును, సువాసనచే మిగుల నెగడు పొగడపూలును, మాధవపదారవింద పూజార్హంబులగు మాధవీచయంబును, యుల్లంబుల కుల్లాసంబును వెల్లిగొలుప నెల్లెడ నల్లుకొన్న మల్లికాదివల్లికల నుండిరాలిన పూవుమొత్తంబులును, కుసుమ సౌరభ్యంబున నన్నిటమించిన సంపంగిపూవులును, హృదయాహ్లాదకరంబులగు విరిజాజులును, పూవిలుకాఁడు తనశరములను పదునుపెట్టెడి నునుపైన పలకరాళ్లో యనంబరగు కదళీతరువులనుండు లేతయాకులును, చిలుకముక్కులచే నొక్కఁబడి కెంపురుచులీనెడి దాడిమీఫలంబులును, మార్గాయాస సంజనిత తృష్ణావిదారణ కారణంబగు నారికేళఫలంబులును, భూర్జ కర్జూర పనసాది ఫలవృక్షరాజంబులును, విమలసలిలాసారంబులగు కాసారబులును తత్కాసారంబులచెంత దొంగజపం బాచరించుచు మీనంబులబట్టుటకై వేచియుండుబకంబులును, మునుగుచు లేచుచు జలక్రీడలనాడు రాజహంసలును, లేమావిచిగురుల మెక్కిమ

త్తెక్కి కో కో యని యారావంబులు సేయు పికంబులును, ము
ద్దుపలుకుల శ్రీరామ రామాయని పిలిచెడు శుకంబులును,
గలిగి డెందంబున కానందంబుగల్పించు నీయుద్యానవనమెంత,
రమణీయముగ నున్నదో చూడుము.

సుశీ— భారతీ! యిటుచూడుము.

తే॥ గీ॥ పూలనుండెడి మధువును ♦ గ్రోలికంపె
భ్రమర దంపతులవిగో హా ♦ వాయిబోలె
జుమ్ము జుమ్మనియెడు ధ్వనుల్ ♦ జిమ్మ చెగురు
చుండెఁజూడంగ మిక్కిలి ♦ చోద్యముగను॥

భార— అవియట్లు పరుగెత్తుట మధురరసంబును గ్రోలిన సంతోషం
బుచేగాదు. నీకురులతో సాటిగా లేమని పరుగిడుచున్నవి.

సుశీ— చెలీ? నీవేళాకోళమున కేమి గాని యాసంపంగిపూవులను కోసి
కొందమురమ్ము. (సంపంగి పూవుగోసి) ఆహాయేమి దీనిసౌర
భ్యము.

క॥ వాడుకొలంది దీనికిని ♦ వాసన హెచ్చగుచుండు దీనికి
జోడగుపూవు లేదెచట ♦ జూడగ వాసన యందువహ్వారే

భార— వేడుకదీరనీకిదుగో ♦ వేడ్కను సంపగిపూవునిప్డుపూ
బోడిరో నీశిరమ్మునను ♦ బొందుగఁ బెట్టెదజూడుమానుషీ॥
(సుశీలజడయందు సంపంగి పూవునుముడుచుచున్నది).

భార— (ప్రవేశించి) సుశీలా! నేటిదినంబున వచ్చిన వార్తా పత్రికయిదుగో. (వార్తాపత్రిక నొసంగి వెళ్లుచున్నది)

సుశీ— (వార్తాపత్రికఁజదివి) సఖి! వింటివా? కన్యలవివాహంబునుగూర్చి యొక్క మహాపురుషుడెట్లు వ్యాసమును వ్రాసినాడో! ఆహా ఎంతచక్కఁగనున్నది. ఎంతజనసమ్మతంబుగ నున్నది.

భార— ఏమనివ్రాసినాఁడు.

సుశీ— వినుము. ‹‹మనభరతఖండంబునందు స్త్రీలకు వివాహంబులొనర్చుట యందు తల్లితండ్రులు మిక్కిలి పొరబడుచున్నారు. పిల్లల కారవయేటనో లేక యేడవయేటనో తల్లిదండ్రులకిష్టము వచ్చినవానిని దెచ్చి కట్టబెట్టుట, తల్లిదండ్రులు ధనంబునకాసపడి యేకురూపికైనను సుకుమార శరీరులగు తమసుతల నొసంగిగాసి జేయుట మొదలుగాగల యనేక దురాచారంబులు మనలోనున్నవి. ఇవియన్నియు తమపిల్లల కెట్టియనర్థకంబులో తలచి చూడుడు. పిల్లల యెడజాలినేదలపరు? ఇదిమీామదికి బుణ్యదాయకంబని తోచెనా? సోదరులారా! నావచనంబులు మీాహృదయంబులకుఁగష్టములుగా దోఁచినఁదోచుఁగాక. శాస్త్రజ్ఞులారా! నేఁజెప్పెడి సంగతియందు శాస్త్రవిరుద్ధంబేమియుగానుపించదు. నాయందుగరుణబూఁనినావచనంబులాలింపుడు. మీాయాడు పిల్లలను వృద్ధిలోనికిఁదెచ్చు మార్గంబును విలోకింపుడు. మొదట మీాపిల్లలను విద్యావతులుగా జేయుఁడు. దీనివలన వారికెట్టి సుగుణంబులలవడునో విచారించి చూడుఁడు. స్త్రీలకువిద్య యేమని వక్కాణించు తుచ్ఛుల వాక్యంబులు

చెవిలో జొరనీకుఁడు. తరువాత వారికి యుక్తవయస్సురాఁగానే యన్యోన్యానురాగంబు గలవరుని దెచ్చి వివాహంబున ల్పుఁడు. ఇదిసర్వజన సమ్మతంబై యొప్పు.

శార— ఇట్లు జరుపుట యెంతయు మంచిది సుమీ.

(తెరలో జాంఘికుఁడు డిండిమవాద్యంబుతో)

ఢం ఓహో! పురజనులారా! నేను చెప్ప లేద నేరు. విన లేద నేరు. గట్టిగా చెప్పుతున్నాను. వినండి. మనచక్రవర్తిగారి కూతురు సుశీలమ్మగారిని సత్యపురరాజు గారగు వత్సరాజుగారికిచ్చి యెల్లుండి వివాహము చేస్తారు కాబట్టి మీగృహంబులెల్ల జక్కగా నలంకరించి పురంబెల్ల శృంగారింపుఁడు.

శార— వింటివిగదా! వత్సరాజుకడనుండి శుభపత్రిక వచ్చెనుగాఁబోలు.

సుశీ— (తనలో) ఇప్పటికి సాహృదయంబుచల్లబడినది.

శార— చెలీ! అటుచూడుము.

తే॥ గీ॥ ఆలమందలు గృహముల ♦ కరుగుచుండె
పిట్టలన్నియుఁదమతమ ♦ పట్టుజేరె
జారచోరు లెల్లరు మది ♦ సంతసింప
నస్తగిరి జేరుచుండెను ♦ నదిగొయినుఁడు॥

కావున గృహంబునకుఁబోదము రమ్మ,

(ఇరువురును నిష్క్రమించుచున్నారు.)

(ప్రథమాంకము. సంపూర్ణము.)

శ్రీ

# సుశీలనాటకము.

## ద్వితీయాంకము.

(సత్యపురము! సుశీలసౌధము. సుశీల. ప్రియంవద.)

సుశీ— సఖి! ప్రియంవదా! ప్రపంచంబున కాంతకుఁ గాంతునికంటె నితరదైవంబు లేదు. చూడుము.

సీ॥ సకలసౌభాగ్యకా♦సారమునకు రాజహంసదలంపఁగా♦నాత్మధవుఁడు
అంచితానందసౌ♦ఖ్యాంబుధి నోలాడఁబతిగదాపూర్ణక్ష♦పాక
[రుండు
సంతాపదావాగ్ని♦శాంతింపనిజభర్తయేకదా ఘనవృష్టి♦జోక
[వాఁడు
సంసారమనుమహా♦సాగరమ్మున దేల్చునౌకకువరుఁడెకా♦నావి
[కుఁడు

తే॥ గీ॥ సకలమంగళములుగూర్ప ♦ జాలువాఁడు
దలపఁగా ప్రాణనాథుఁడే ♦ తరుణికెపుడు
యింతవచియింపఁగానేటికిఁ♦ కెంచిచూడ
తోయజాక్షికిభర్తయే ♦ తోడునీడ॥

సీ॥ దరిలేనిదుఃఖాబ్ధి♦తరియింపఁజేయగా భర్తసేవగదజూ♦పట్టునావ
స్వర్గపురాంతర♦సౌధరాజము నెక్కఁ-రమణు సేవయెగదా♦రాచ
బాట|సహధర్మచారిణీ♦సద్వ్రతమ్మున కెన్నఁనాత్మనాథుని సేవయూ

లవాల| మతిపాపసముదయా♦రణ్యము జెక్కంగ కోమలాంగుని
సేవ♦కులిశధార||

తే||గీ|| సకలకార్యనిర్వాహక ♦ సాధనంబు
ప్రాణకాంతుని నిజపాద ♦ పద్మసేవ
అంచితానందమునుగూర్చు ♦ సతివకెపుడు
ప్రాణకాంతుని నిజపాద ♦ పద్మసేవ||

ఇది యట్లుండనిమ్ము.

చం|| పతిహితవృత్తి నెప్పుడెడఁ ♦ బాయక కోరికతో డసజ్జన
స్తుతహరి గాథలార్యులు బుధుల్ వినిపింపగ వించుమోదము
ప్రతిలఁగ వారికింగడున ♦ పర్యలు సేయుచు గీర్తినొందునా
సతినె పతివ్రతామణిగ ♦ సజ్జను లెంతురు ధారుణీస్థలిఁ
పతివ్రతయెప్పుడును,

తే|| గీ|| ఉన్నదానికి సంతృప్తి♦నొందుచుండు
నెల్ల పూజలు సేయుచు ♦ నెగడుచుండు
నఖిల సాధ్వీజనైకహృ ♦ ద్ధ్యాన పద్య
సుగుణ గణ నీయయగుచుండు ♦ జగతియందు||

తే|| గీ|| అత్తమామలయందున ♦ బత్తిగలిగి
మఱదుల యెడసంతతమున ♦ త్కరుణఁజూపి
భృత్యజనముల నెపుడుకో ♦ పింపబోక
నుభయకులములకు సుకీర్తి ♦ యువిద దెచ్చు||

క॥ పరపురుషులు సోదరులుగ
పరద్రవ్యంబులుతృణముగ ♦ బరికించిమనో
హరు సేవించుచు నుండును
ధరణిఁ సద్గుణవధూటి ♦ తలిరుంబోఁడీ॥

తే॥ గీ॥ రమ్యగుణముల చేతను ♦ రమణ కెక్కు-
ప్రాణనాయక పదపద్మ ♦ భజనశీల
ప్రాణహానికైన నోర్చు ♦ గానిమాన
హానిసైపంగ జాలదో ♦ యతివవింటె॥

వేయేల,

క॥ పతియేదైవము గురుడుఁ
పతియేసకలంబునుమ్ము ♦ పడతికి నెపుడుఁ
పతి సేవఁజేయ నెంచని
సతి బ్రతుకు బ్రతుకెదలంప శ్మశాతలమందుఁ॥

ఒకతృటికాలంబైనను పతినెడబాయక పతియెన్ని బాములఁబడు చుండి నను దానునునాతనితో బాములుపడుచుఁబతి యొద్ద నుంటచే నవియెల్ల సుఖంబులుగనే భావింపుచునుగుణసంశీలము లుగలిగిశోభిల్లుచుండును.

ప్రియం— చెలీ! నాయందు గరుణచే శ్రమఁబూని నీవు వచించినట్టినీతి దాయకంబులగు వాక్యంబు లాలించి నే నపారసంతోషపారావా రాంతర్నిమగ్నమానమానసనైతి.

సుశీ— మఱియుఁ పతివ్రతలకు స్వబలంబుకంటె దైవబలం బెక్కుడుగ నుండును.

ప్రియం— సఖీ! నీవు చెప్పినమాట నిజమే.

సుశీ— (ఆలోచించుచున్నది.)

ప్రియం— అనుఁగుసఖీ! నీవేదియో యాలోచించుచున్నట్లున్నావే?

సుశీ— ఏమున్నది!

మ॥ ననునెన్నండును బాసియుండఁడుగదా ♦ నాథుండు నేడేలొకో
యినుఁడస్తాద్రికిఁ జేరుచుండినను దా ♦ నిందాఁకరాడయ్యెనే
మనపౌరుల్ తమసంగతుల్ దెలుపఁగా ♦ క్ష్మాధీశుఁదర్శింపఁగా
జను దేరన్ వినుచుండెనోయకట మ ♦ త్స్వాంతంబునన్ దోచ దే
అట్లుగాక

తే॥ గీ॥ శాత్రవుం డెవ్వడైన రా ♦ ష్ట్రంబుపైని
దండు విడియుటచేత బ్ర ♦ చండభండ
నంబొనర్చుటకై హృద ♦ యంబునందు
దలఁపుఁబూనుచునుండెనో ♦ తలఁపగాను॥

ప్రియం— తరుణీ! పురజనులు తమ కష్టసుఖంబుల దెలుపుకొనుటకుఁ జనుదెంచుటచే నాలస్యంబై యుండవచ్చు. అంతియేకాని,

మ॥ అరిరాట్కానన వీతిహోత్రుఁడు సము ♦ ద్యద్భూరి తేజుండు శ్రీ
తరుణీనాథ పదారవిందయుగళ ♦ ధ్యానైకశీలుండు, స

త్కారుణావాలుఁడువత్సభూపతినిసం ♦ గ్రామంబులోఁదాఁకఁగాఁ
దరమేయన్యథరాధినాయకునకుం ♦ దథ్యంబుగాఁ జూడఁగన్॥

తే॥ గీ॥ అఖిలరాజన్యమౌళి ర ♦ త్నాంశుదీప
రాజనీరాజితాంఘ్రివి ♦ భ్రాజమాను
డతని నామంబువినఁగనే ♦ యవనిపతులు
జడియుచుందురు సతతంబు ♦ సరసిజాక్షి॥

సుశీ— ప్రియంవదా! యెందుచేతనోగాని చిత్తంబంతయు కలవర పడుచున్నది. కుడికన్నును కుడిభుజంబును నదరుచున్నవి. ఏమి యశుభంబు వాటిల్లునో తెలియకుండె. ముకుందపదారవిందమకరంద రసపాన మధుకరులమగు మాకుఁగాని రాష్ట్ర జనులకుఁగాని యేకీడును రాకుండుఁగాక.

ప్రియం— అదుగో రాజుగారు వచ్చుచున్నారు.

సుశీ— (భర్తకై జూచి ప్రియంవద నుద్దేశించి) ప్రియంవదా! నాథుని ముఖంబు వీక్షింపుము.

మ॥ వనితా! పున్నమచంద్రుబోలుముఖబిం♦బంబంతయుఁ వాడియా
ఘనగర్భాంతరచంద్ర బింబముగతిఁ ♦ గన్పట్టెగన్నీళులున్
జనుచుండెన్ గద కాల్వలై యిపుడహో ♦ జాలిన్బడన్ గారణం
బును నూహింపఁగఁగాన రాదుగదవే ♦ పూబోఁడివీక్షింపఁగన్॥

ప్రియం— (తనలో) అదుగో రాజుగారు వచ్చుచున్నారు. ఇఁక నే నిచ్చట నుండరాదు. (నిష్క్రమించుచున్నది.)

వత్స— (ప్రవేశించి) తనలో హా దైవమా!

ఉ॥ ఏమని చెప్పువాఁడనిపు ♦ డీగతి సన్ను జయధ్వజుండు నా
భూమితలంబువీడి వన ♦ భూమికిఁబొమ్మనినాఁడటంచు నా
కామిని దీనినిన్వినఁగఁ ♦ గాంచదె దుఃఖము నాత్మలోన నా
హా మహిలోన జేకురెను ♦ నద్భుతకష్టమునాకు దైవమా॥

చింతించుట వెఱ్ఱితనము. ముందుగా నా రమణీమణి చిత్తంబు గనుంగొని పిదప యీవార్త దెలిపెద. (సుశీలదగ్గర కేగుచున్నాఁడు.)

సుశీ— (లేచి నిలుచుండి)

తే॥ గీ॥ ముద్దులనుమూటగట్టు మీ ♦ మోము నేఁడు
వాడియుండెను నిసియందుఁ ♦ బద్మమట్లు
కారణము జెప్పనందాఁకఁ ♦ గడుపులోన
జేయిపెట్టి కలఁచినట్టు ♦ లాయెనిపుడు॥

ప్రతిదినంబును నున్న సంతోషంబు గానరాదు. చింతాక్రాంతులై యున్నట్లు దోఁచెడి. ఈ సేవకురాలు దానికిఁ గతం బెఱుంగఁదగునేని మన్నించి వినుపింపఁ గోరెద.

వత్స— తరుణీ! సకలసౌఖ్యంబులకును నాకరంబగు నీవు నాకుసతివై యుంటచే నాకుఁ జింతయేల కలుగును. కాని నీమనంబు దెలియ నొక్కసంగతి నడుగఁ దలఁచితిని, అందువిశేషమేమి

యు లేదుగాని, నేనొకవేళ రాజ్యభ్రష్టుఁడనై వనవాసంబు సల్పినైనచో నీవేమి చేతువా యని నామనంబున బెంగపడి నది.

సుశీ॥ చం॥ పలికెదవేలనీవిటులు ♦ వ్యాకులతన్ మదిఁబూని; యేరికిన్
దలఁపవు కీడు సేయఁగను ♦ ధారుణియందున నట్టి నీవు బా
ములఁబడుటెట్లు నిక్కమిది ♦ బొందిన నీ వెను వెంట వత్తు నిన్
విడిచి మనంగనోపుదునె ♦ వీరచరిత్ర మనోధవా భువిన్॥

మీ కట్టియిక్కట్టు లెప్పుడును సంభవింపవు. ఒకవేళ దైవము మనయందుఁ గరుణఁ బూనక యిక్కట్టులకుఁ బాలుచేసె నేని నేనును మిమ్ముఁగూడి చనుదెంతు. మిమ్ము విడనాడి నిమిష కాలంబైనను జీవింపఁగలనా! పతిని బాసి చరించు కాంత బ్రతుకు సజ్జనులచే శ్లాఘింపఁబడదు.

వత్స— (తనలో) ఆహా! యిట్టివిగదా పతివ్రతాగుణంబులు.

చం॥ పతిహితవృత్తి నెప్పుడెడ ♦ బాయక యుండెడి నాతి నే బతి
వ్రతగ గణింత్రు సజ్జనులు ♦ భావమునందున సంతసంబునన్
పతిహితవృత్తి నెప్పు డెడఁ ♦ బాసి జరించెడు కాంత మృత్యుదే
వతగ గణింత్రు సజ్జనులు ♦ భావమునందున సంతతంబునున్ ॥

(ప్రకాశముగా) సద్గుణజాలా! సుశీలా! నీవట్లు పలుకుటచే స్వాంతంబునంగలుగు చింతపోయి సంతసం బుదయించె. నాకుఁ గల్గిన చింతకుఁ గారణంబేమనిన నేఁడు నిండుఁ బేరోలగంబున

మంత్రిసమేతుండనై గొలువుదీర్చియున్నప్పుడు శ్రీ నికేతనపురాధీశ్వరుండగు భవజ్జనకుండు కొంతసైన్యమును నాపురంబును ముట్టడివేయ బంపి ముట్టడివేయకపూర్వమే చారునితో,

మ॥ కరమర్థిఁ గరణ మాచరించెద నెగాఁ • కఁ జాయతోఁ గూడి దు
ష్కరమైనట్టి యరణ్యవాసమునొగిఁ • సల్పంగ నీవే గదో
నరనాథాగ్రణి రెండు ప్రశ్నలకిటఁ • బ్రత్యుత్తరం బిమ్మటం
జరహిఁ వార్త్తను బంపె వింటివిగదా • చోద్యంబు వీక్షింపగఁ॥

సుశీ— (తనలో జనకునుద్దేశించి) జనకా! యల్లున కిచ్చుకట్నం బా యిట్టివార్త్తఁ బంపుట? అల్లుడనియైనను దలంచి శత్రుత్వంబుమరువరాదా! ఇట్టిపనిజేయుట నీబోటిసుగుణాఢ్యులకున్యాయంబా? వత్సరాజును బెండ్లిగాక పూర్వమే యల్లుండనియైనను దలంపక నతని రాజ్యంబు చూరగొందునని చెప్పితివి. (ప్రకాశముగా భర్త్తనుద్దేశించి) నాథా! అందులకు మీరేమి ప్రత్యుత్తరంబొసంగితిరి?

వత్స— తరుణీ! నిన్నుదలంచియైనను నతడు శత్రుత్వంబుమఱువక నీతిమాలివర్త్తించెనుగాని నేనట్లువర్త్తింతునా? ఆతడాచరించినట్లే నేనును ఖడ్గంబును బూని సమరంబునకుదలపడితి నేని మామతో కయ్యంబాచరించు వాఁడని సుజనులు నన్ను హేయంబుగఁ జూడరా? అందుకై నేను సమరంబాచరింపననియు, భార్యాసహితుండనై గహనావాసంబు సల్ప నేగుదుననియు చారునితోఁజెప్పిపంపితి. కావున మనమీరాత్రియే కాననంబున కేగవలయు. అక్కటక్కటా! రమణీమణీ! నన్నుఁ బెండ్లాడి సకల సౌ

భాగ్య సంపద్వార్ధినోలాడుదువని దలంచితి గాని యిట్టియిక్కట్టుల పాలగుదునని తలంపవైతివిగదా! నన్నేల పెండ్లాడితివి? నీ జనకుండునాకు శాత్రవుండనియైనను దలంపక నన్ను వరించితివి. సకలభూపాలురును నిన్నువాంఛించి తమ తమ రూపపటంబులు నీజనకుని కడకు బంపుచుండ, శాత్రవుండనితలంచి యూరకుండక నేనును నారూప పటంబేల పంపితి? పంపితింబోనిమ్ము. వాటింగాంచి నీజనకునకిష్టమైన రాజుందెచ్చి పరిణయంబు సల్పక నీయిచ్చవచ్చినవానినే గోరుకొనుమని చెప్పనేల? చెప్పెను బోనిమ్ము. వాటింగాంచి నన్నుమించిన సుందరాకారులగు రాజకుమారు లెందరోయుండఁగా నన్నే యేలవరించితివి? అయ్యయ్యో, నిష్కారణంబుగ నెట్టి బాములకు బాలుపడితివి. నన్ను వివాహమాడకుండినచో నీకీపాట్లు రాకుండును గదా.

సుశీ— నాథా! నేనట్లు దలంచుట లేదు గాని నన్నుబెండ్లాడుటచేతనే మీకీకష్టంబులొనగూడెనని చింతించుచుంటి. నన్నుగూర్చిమీకావంతయు డెందంబున సందియంబువలదు. నేనుమీతోపాటు కష్టసుఖంబు లందవలసిన దాననే గాని మిమ్ము విడచియుండు దానను గాను. కష్టంబులఁ గూర్చి మీరు చింతింపవలదు.

తే॥ గీ॥ కష్టమెవ్వా డనుభవింప♦గలిగినామొ
యపుడె సకలసుఖంబుల♦నందనౌను
మున్నురాము డరణ్యభూ♦ములఁ జరించి
కష్టముల్బడి సుఖములు♦గాంచలేదె॥

తే॥ గీ॥ దైవగతియెట్టులుండునో ♦ ధరణియందు
నట్టిరీతినిదప్పక ♦ యగుచునుండు
నద్దిగడవంగా నెవ్వారి ♦ కైనఁగాని
తరముగాదు జంతింపకు ♦ తరుణియింక॥

వత్స— యోషారత్నమా! నీవునాయండనుండనాకేవిధమయిన చింతయులేదు. ఆభారతీనేతయడవులఁగడునిడుమలఁబడుమని ఫాలతలమున వ్రాసినాఁడు. అంతకును నానందనందనుండే మనకునహాయభూతుండగుఁగాక. ఇకమనమీరేయి పురంబు విడువవలయు. కావున మనయిలవేల్పగు నాముకుందుని మనసారనొక్కమాఱు భజించి గహనాసంబును గూర్చి నిష్క్రమింతము. రమ్ము.

(నిష్క్రమించుచున్నారు).



ద్వితీయరంగము. అరణ్యము

(వత్సరాజు-సుశీల ప్రవేశించుచున్నారు.)

సుశీ—

మ॥ అడుగైనన్ నిడజాల నింకను ఘనా ♦ యాసంబుమెండయ్యె ని
ప్పాడుభూపాలక సత్కులాభరణనన్ ♦ బ్రోవన్ దగున్ సత్కృపన్

వత్స—

బలు కష్టంబులు చెందగల్గితివిగా ♦ ప్రాసాదమందెప్పుడున్

గడుసౌఖ్యంబున నుండుమనీ విపుడహో ♦ కాంతాశిరోరత్నమా॥

సఖి! ఇప్పుడుశని మనపాలిట నున్నాడు. అక్కటా! కలిబాధ సహింపఁ దరంబుగాదుకదా!

సుశీ—

ఉ॥ ఆఁకలిబాధకంటెఁగడు ♦ నా కలిబాధయెయెక్కువయ్యె నో

వత్స—

ప్రాకటచంద్ర బింబముఖి♦రమ్యచరిత్ర సుశీల చూడగా
జేకురవయ్యెనయ్యొసర♦సీరుహనేత్రి ఫలంబు లెచ్చటఁ॥

సుశీ—

నాకుబలంబు దగ్గెనర♦ నాయకనే నడువంగజాలనే॥

వత్స—

అబలా! ఈవృక్షంబునీడయం దించుక విశ్రమించి యలసటతీర్చుకొని పిదప నేదైనపురంబు జేరుటకు ప్రయత్నింతము.

(వృక్షంబునీడకు జేరి విశ్రమించి)

వత్స— (తనలో) ఆహా! ధాతవ్రాత! అయ్యోనాదియెంత నిర్భాగ్యపుబ్రతుకు. సకలరాజులచే వినుతిగాంచుచు సత్యపురంబేలునట్టి నాకీయరణ్యవాసంబునఁగాంతాసమేతుండనై యిట్టియిక్కట్టులుపడవలసి వచ్చెనుగదా. నాయవస్థ యట్లుండ,

చం॥ వెలదులుసర్వకాలముల♦వేడ్కను గొల్వగ రత్నసౌధమం
దలరుచు నన్నుగూడి సుఖమందుచు నుండియు సచ్చరిత్రయై

చెలఁగెడి యీమెయిప్పుడు వసింపగనయ్యెను గాననంబులో
దలఁపఁగనెట్టి వారికిని ధాతలిఖించిన వ్రాలుదప్పునే॥

(ప్రకాశముగా) సరోజాక్షీ! నామూలంబున నీకెట్టి కష్టంబులు సంప్రాప్తమయ్యెను. అడవులందు నా వెంబడి దిరుగుచు గడు నిడుమలు గుడుచుచుంటివి గదా! పరిచారిణులు సంతతమును గొలువ వైభవంబున నవరత్నఖచిత ప్రాసాదంబున మెలంగు నీవు నా మూలమున ఘోరకాననమునకు రాఁగలిగితివిగదా! పండువెన్నెలయందైనను నించుక నడువవెఱచునీవు నాకతంబునఁ గాదె నేఁడీ వేఁడి యెండలో నడచుచుంటివి. కోకిలారవంబు లాలింప భీతిల్లు రమణివినీవు నేఁడీ ఘోరకాంతారంబున ఘనసింహ శార్దూల రవంబు లాలించుచుంటివి.

సుశీ— మనోవల్లభా! నన్నుగూర్చిమీరు చింతింపవలదు. మీయండ నుండి నేననుభవించు కష్టంబులన్నియు నాకు సుఖంబులే. ఆపద వచ్చువేళనే ధైర్యంబు బూనవలయు. చూడుడు!

శా. దారిద్ర్యాంబుధి గూలినప్పుడు మహాద్రవ్యంబు గోల్పోవుచో
ఘోరంబౌ విపదబ్ధిమున్గి కడుచిక్కుల్ చెందగానున్నచో
ఘోరారణ్యమునందు నెవ్వరును దిక్కున్ లేక యున్నప్పుడుఁ
ధీరత్వంబును బూనగావలయుగాదే మానసంబందునన్॥

వత్స— మనోహరిణీ! యింకెక్కడి ధైర్యము. యింకెక్కడి రాజ్యము. ఈ నిర్భాగ్యుఁడు గ్రిమ్మర రాజ్యంబుగూడ నేలునా.

తే॥ గీ॥ పావనంబైన గంగాప్రవాహమెలమి
పుణ్యభూములయందునఁబొల్చుమీఱి

[illegible] గ్రంథాలయము

బాఱుచుండును సతతంబు•వట్టినేల
వైనబాఱుమంచును గోర•బాఱనగునె॥

సుశీ— నాథా! చీఁకటి కొన్నిదినంబులును, వెన్నెల కొన్నిదినంబులును గాయుచుండును. కల్మిలేములు కావడికుండల వంటివి. నేను మీకు జెప్పవలసినదానగాను.

వత్స— తరుణీ! అదిగో భానుమంతుని పురంబు. నీ వీ వృక్షంబు కడ నుండుము. నేనిదేసత్వరంబుగ పురములోనికింబోయి మనకుఁ గావలసిన యాహారంబును గొని తెచ్చెద.

సుశీ— నేనిచ్చట నొంటరిగ నుండజాల. తమవెంట నేతెంచుట కానతిండు.

వత్స— రమణీ! నా వెంటవచ్చుట కేమియు యభ్యంతరము లేదు; కాని, శుద్ధాంత సౌధంబున నోరులకంటబడకుండ మెలంగిన నీవు నేఁడీ పురంబున సర్వజనంబులచే జూడబడ నేల? అదియుంగాక మనమిరువురమును, గలిసిపోతిమేని మనల నానవాలు పట్టగలుగుదురు. నేనొంటరిగ నేగితినేని యే రహస్యమార్గంబుల నెంబడినో సత్వరంబుగబోయి కావలసిన యాహారంబు దెత్తు. నీ విందుకు మారుబలుక్కర యిచ్చటనుండుము. పోయి వచ్చెద.

సుశీ— మీరు కడు రయంబున రావలయునుండీ.

వత్స— సందియంబేల? (నిష్క్రమించుచున్నాడు.)

సుశీ—(తనలో దైవము నుద్దేశించి) అకటా!, దైవమా! రాజాధిరాజు లెల్ల నరిగాపులై రాజ్యంబేలు నానాధుని స్వయముగా భోజనసామగ్రి దెచ్చునట్లు జేసితివా? ఆహా! నీచర్య లతివిచిత్రంబులు.

ధనపాలుడు—(ప్రవేశించి; తనలో) రాజకుమారుండు తనరమణీ మణిని నిచ్చుటనే గదా విడిచి వచ్చితినని చెప్పినాడు. సామగ్రి నిచ్చుటయం దాలస్యము జేయుమని నాసేవకుండగు రామభద్రునికిఁ జెప్పితినిగదా. నేనెట్లులైనను నా రాజనందను డిచ్చుటకి రాకపూర్వమే ఈమెను వంచించి మద్గృహంబునకు దోడ్కొని పోవలెను. ఈమెను మోసపుచ్చుటకు నానవాలుగా నాతని యుత్తరీయంబును బియ్యంబు దెప్పింతునను నెపంబున గైకొని తెచ్చినాడనుగదా. అదుగో! యీవృక్షంబుకడ నారమణీమణి యున్నది.

సుశీ—(తనలో) నాథుండరిగి చాలా సేపయ్యెను. యింతవఱకును రాలేదు. ఒంటరిగనుండుటకు మనంబున మిక్కుటంబగు భీతి వొడముచున్నది.

ధన—(తనలో సుశీలను నుద్దేశించి) ఆహా? యేమిసౌందర్యము!

తే॥ గీ॥ బాలగాదిది మరుచేతి♦కోలగాని
కొమ్మగాదిది బంగారు♦బొమ్మగాని
కాంతగాదిది రత్నాల♦బంతిగాని
అంబుజాక్షిగాదుశశిబిం♦బంబుగాని॥

ఇక్కరంగాక్షి చక్కదనంబెన్న నక్కలువరాయని కైనను దరంబుగాదు.

తే॥ గీ॥ చక్కదనముల నొక్కచో♦ లెక్కబెట్టి
ఈమెయందు దన్నియును జేర్చి♦యింపుతోడ
సృష్టి జేసెను గాబోలు♦సృష్టికర్త
గాకయున్ననిట్టి సొగసు♦గలుగనౌనె॥

అట్లుగాదేని,

మ॥ ఘనరంభాది విలాసినీ వతులలో♦కంబందు సృష్టించి ఖ్యా
తిని జేపట్టె విధాతనేనును సుకీ♦ర్తింజెంద నానేర్పునన్
వనితారత్నము నొందుచేతుననుచున్♦బంతంబుతో నీసతిన్
జనియింపంగను జేసియుండును రమా♦సత్పుత్రు డిద్ధాత్రిలోన్॥
ఇట్టి యందచందంబులుగల మందయాన నెందును దిలకించి యుండలేదు.

తే॥ గీ॥ ముదితలావణ్య వైభవ♦మ్మగనులార
గాంచినంతనే శరములు♦ కాముడిపుడు
బరుపసాగెను నాపైన♦గరుణలేక
క్రూరమృగమును వెన్నాడి♦గూల్పనెంచి
బాణములువిడిచెడి వేట♦కానిపగిది॥

మ॥ సరసాలోకనహాసభాసురవిలా♦సస్ఫూర్తి దీపించు సుం
దరమా దీనిమొగంబు గాంచినంతనె హరి♦ధ్యానైకనిష్ఠాపరుల్
వరమౌనీంద్రులు దీనియొద్ద ఘనసేవల్♦సేయగానెంచుట

బ్బురమగా నేదిలకించి చూడగమదిన్ మోహాతిరేకంబునన్॥

పాపము! అడవులవెంబడిగడునిడుమలు గుడుచుచుఁదిరుగుటచే నొడలువాడియున్నది. నాయొద్ద నింత లెక్కకుమీరిన ధనము న్నందుకు నిట్టి తరుణీ శిరోరత్నము నాకుండవలసినదే.(సుశీలం జేరి (ప్రకాశముగా)అబలా! భర్తరాక కెదురుచూచుచుంటివా?

సుశీ— అన్నా? నీవెవ్వరవు?

ధన— (తనలో) అన్నాయని పిలువకుండిన బాగుండునుగదా! (ప్రకాశముగా) నే నీ భానుమంతుని పురంబుననుండు ధనపాలుండను వైశ్యకుల శ్రేష్ఠుండ. నీ భర్త భోజనసామగ్రిగొనుటకై నాకడకరుదెంచి మా యింట గొన్నిదినంబులు కాలంబుగడుపుటకై నన్నుఁగోర నే నందులకు సమ్మతించితి. ఈయుత్తరీయం బానవాలుచూపి నిన్నుఁగొనివచ్చుట కెవ్వరినైనఁ బంపుమని నీ నాథుండు నన్నుఁగోర సేవకు లెవ్వరును సమయంబునకులేక పోవుటచే జాలిదలంచి నేనే వచ్చినాడ. జాగుసేయక రమ్ము.

సుశీ— అన్నా! నీకెంతయు పుణ్యములభించును. ఇట్టి దీనులయెడ దయగల్గిన నిన్ను నందనందను డనిశమును రక్షించుగాక. పోదమురమ్ము. (నిష్క్రమించుచున్నారు.)

ద్వితీయాంకము సంపూర్ణము.

శ్రీ

# సుశీలనాటకము.

## తృతీయాంకము.

(భానుమంతుని పురంబున ధనపాలుని గృహము.)

సుశీ—(తనలో) అక్కటా! యీధనపాలుఁడు నన్నెంత మోసపుచ్చెను. నాధుండు నన్నారయుట కెంత కష్టపడుచున్నాఁడోగదా! నావర్తమానంబాయనకు దెల్పువారెవరు? (దైవము నుద్దేశించి) అయ్యో దైవమా! అంతటిమహారాజు గర్భంబున నుదయించి వత్సరాజునకు భార్యనైన నన్ను దిక్కులేని పక్కికరణి జేసితివా? నేనేమి నీకపకారంబాచరించితి? డెందంబున నీపదారవింద భజనదక్క వేరేమియు నెఱుంగని బేలనగు నన్నీలీల గాసిఁబెట్ట నీకు మేలె.

సీ॥ కోపమా లేకనా♦పాపమా నన్ను సంతాపబెట్టంగనో♦దైవరాయ
భేదమా నీకేను♦వాదమా నాతోడ ఖేదముఁ గూర్పంగ♦సాధు
వంద్య
వాసియా నీకిది♦దోసమా నాయది యాసునఁజూడంగ♦భాసురాంగ
నేరమా నావల్ల♦ భారమా నేను విచారముఁ గూర్పంగ♦
సదయ హృదయ

తే॥ గీ॥ యింతవంతను గూర్పంగ♦స్వాంతమందు
దలపుబూనుట గడుమంచి♦దా తలంప

ప్రోవవే యిపుడైన సం♦పూర్ణకృపను
పరమ కరుణా స్వభావ గో♦పాల దేవ॥

అయ్యో యెంత వెఱ్ఱిదానను. ఫాలతలమున నిట్టిదుమలు పడుమని యీలీల విధాత వ్రాలువ్రాయ నద్ది తప్పునా. నాథుం గాంచు భాగ్యంబు నాకీ జన్మంబుననున్నదో లేదో! కాంతుని గాంచలేక పోతినేని మరణమే శరణము. నాథుని నరయుటకు ముందీ భవనంబునుండి తప్పించుకొనుటెట్లు? నాకెవ్వరు సహాయభూతులగుదురు. (ఇంచుక యూరకుండి) ఈవంతకు నేనే కారణంబు; లేకుండెనేని నాథుండు పురిలోనికి భోజన పదార్థంబుల కొఱకై యేగినప్పుడు నేనేల వెంట నేగక పోతిని. (నాథునుద్దేశించి) మనోధవా! యొక్క త్రుటికాలంబైనను నన్ను బాసి యెఱుంగవుగదా!

తే॥ గీ॥ గడియయైనను గానిక ♦ గనక యున్న
మిగుల జింతచే నీమది ♦ పొగలుచుండు
నిపుడు ననుగూర్చి నీమది ♦ నెంతచింత
పడుచునుంటివో కటకటా ♦ వత్సరాజ॥

మ॥ ననుఁబెండ్లాడి సుఖాబ్ధి దేలుదనుచున్ ♦ భావంబునందక్కటా
యనుమానింపక యెంచినావుగద ఘో♦రారణ్యమందున్ నినున్
ఘనకారుణ్యము లేక దైవమిటులన్ ♦ గారించు వాడంచు నీ
మనమందెప్డు దలంపవైతివిగదా ♦ క్ష్మాపాలచూడామణీ॥

నన్ను వివాహమాడుటచేగదా నీకీ యిక్కట్లు సంభవించె.

ధన— (ప్రవేశించి తనలో) నేఁటిదినంబున నేమైననునరే నాకోరిక యీకాంతకుఁ దెలుపక దాళజాల.

తే॥ గీ॥ ప్రాణహానికైనను నోర్తు ♦ బరగనిపుడు
కాంతగూడక నించుక ♦ కాలమైన
తాళగాజాల నామది ♦ తథ్యముగను
నేమియైననునరే వేడు ♦ దింతినిపుడు॥
(సుశీలంజేరి ప్రకాశముగా)

ఉ॥ నిన్నిలఁబుట్టఁజేయుటకు ♦ నీరజగర్భున కెన్నినాళులో
యన్నుల మిన్నయయ్యెగద ♦ యందము జందముచారుశీలసం
పన్నతయందునీకు సరి♦భామనుజూడను నిన్నుజూడగా
గన్నులు చాలవాయెగద ♦ కావలె వేయి కురంగలోచనా॥

మ॥ ఘనునింగన్గొనుచాతకంబు ద్యుమణిం♦గాంక్షించు చక్రంబుచం
ద్రునిజూడన్దలచున్ చకోరి ఘనసం♦తోషంబుతో నెప్పుడున్
నినునామానస పక్షిగూడదలచెన్ ♦ నీచిత్తమెట్లున్నదో
వనితాకోమల పద్మపత్రనయనా ♦ బాలేందు బింబాననా॥

తరల

వనితరో యిఁకఁజెప్పువాడను ♦ భావమందున దాచకన్
మనమునందున నిన్నుఁ గూడఁగ ♦ మానినీమణి కోర్కెలున్
జననమయ్యెను మానుతుండును ♦ శస్త్రపంక్తుల వేసెనే
ఘనముగాగృప జూపుమాయిఁక ♦ గౌగిలింపుము వేగమే॥

సుశీ— (తనలో) హరి! హరీ! యీవైశ్యుం డెంత దారుణ కృత్యంబున కొడిగట్టినాఁడు. ఈతని బుద్ధినెట్లైన నీతిపథంబునకుం ద్రిప్పవలె. (ప్రకాశముగా) సుగుణగరిష్ఠా! వైశ్యకుల శ్రేష్ఠా!

తే॥ గీ॥ అన్న పరకాంతరతి పాప◆మన్న నన్నుఁ
గూడుదలపును నీమది◆వీడుమన్నఁ
జేర్పునీసతియందున◆జిత్త మన్న
పుణ్యజనులు పోవు తెరువు◆పోవుమన్న॥

ధన— కవిరాజవిరాజితము.

ఇది వరకీ ధరణీ తలమందున◆నిందు నిభాస్యల నెందఱినో
ముదమునఁ గాంచితి నీకు సమానుల◆మోహినిగాంచగలేదెచటన్
మదనుని బారికి జిక్కితినిప్పుడు◆మానినినిన్నిట గాంచగనే
యధర సుధారసమిచ్చి కనందగు◆నబ్జదళాక్షిరొ పూర్ణకృపన్॥

ఉ॥ నీదువ యోవిలాసమును◆నీరజవైరినిబోలు మోమునున్
నీదువిశాలనేత్రములు◆నీకడు దీర్ఘశిరోజపంక్తియున్
నీదు శరీర మార్దవము◆నీదు కుచద్వయి సుందరత్వమున్
మోదముతోడఁగాంచితిని◆మోహము జెందితినన్ను బ్రోవుమీ॥

సుశీ— (తనలో)హా దైవమా! ఘోరకాననంబులందైనను కందమూలఫలంబు లాహారంబుగాభుజింపుచు గాలంబుగడప నీయక నన్నునామనోహరున కెడబాపి తుదకీవైశ్యాధముని చేతిలోఁ జిక్కఁజేసితివా? (ఇంచుకయూరకుండి వైశ్యునుద్దేశించిప్రకాశము

గా)అన్నా! నిజమనోధవ సేవవిడసాడఁజేసి వంచించి నన్ను గొని తెచ్చినావు. ఇదియెంతయు నీకుఁబాపము. నీవిక నిట్టితలంపులు మదినిబూనక నాయందుసోదరీభావమవలంబించి కరుణతో నా భర్తయెక్కడనుండునో వార్తబంపినన్నాయనకడకుఁబంపుము. నీకు గడుపుణ్యంబు సంభవించును. అంతేకాని పతివ్రతల నెప్పుడును శీలభంగము జేయుకోరిక చిత్తంబున బూనకుము. పరాంగనారతిమానసులకు ముక్తి దూరంబగును. నావాక్యంబులు వేదవాక్యంబులుగా మదిందలపోసి నన్ను నాభర్తకడకు బంప యత్నింపుము.

ధన—— (తనలో) ఈమె పైకిట్లు చెప్పుచున్నను చిత్తంబున మాత్రము నాయందుకరుణ లేకపోలేదు. ఎందులకో యించుక కాలహరణంబుఁ జేయుచున్నది. (ప్రకాశముగా)

మ॥ అకటా వీడిన నీదుభర్త కొఱకీ♦యాలాపమింకేలయో
చకితాక్షీ మణి చింతలెల్ల నొగినీ♦స్వాంతంబునన్ వీడియీ
సుకుమారున్ ధనపాలగుప్తవరునిన్♦ శోభిల్లఁగాఁగూడుమ
త్యకలంకంబగు సౌఖ్యమందెదవు ని♦త్యానందివై సుందరీ॥

అబలా! యడవులంగడు బెడిదంపుటిడుమలఁ బడుచు నాధనహీనుండగు భర్తతో నేమి సుఖంబులందెదవు?

తే॥ గీ॥ అపుడె యెండను వైచిన♦యట్టి లేత
తామరాకు పగిది వాడి♦తనరనేల
చింతలన్ వీడిమల్లెపూ♦బంతి పగిది
నన్నుగూడి యుండఁగరాదె♦వన్నెలాడి॥

తే॥ గీ॥ రమ్మునాతోడ గలియగా♦రమణి మద్గృ
హమ్ము నుండు వివిధభూష♦ణాంబరముల
నెమ్మిధరియింపు నామాట♦నమ్ము భార్య
కంటె నెక్కుడు గాఁగాంతు♦గాంతనిన్ను॥

సుశీ—(తనలో) ఈదుర్మతి నే జెప్పిన సంగతి పెడచెవిబెట్టి తాఁబట్టిన కుందేటికి మూడే కాళ్లనుచున్నాడు. (ప్రకాశముగా) సోదరా! నాపలుకులు నీకు రుచికరములుగా గనుపించుట లేదా?

కం॥ కామము లేనట్టి సతిని♦గామింపఁగఁజూచుచుంట♦గడుపాపంబౌ
కామము గల్గిన నీసతి। గామించి సుఖంబునందు♦కరుణామతివై॥

తే॥ గీ॥ అగ్నిసాక్షిగ గైకొన్న♦యతివ గుంద
బంధుజనములు మిత్రులు♦పరిహసింప
పరసతినిరతి దేలఁగా♦భావమందు
దలతు రేనిన్నుఁబోలిన♦ ధన్యగుణులు॥

ధన—

మ॥ వనితారత్నమ! యిద్ది కూడదనుచుఁ♦బల్కంగ న్యాయంబె నీ
కనుమోదంబగు నట్లు చేసెదఁ బ్రమో♦దాయత్తచిత్తంబుతో
ననునీభర్తగ జూడుమా యధరపా♦నంబిచ్చి రక్షింపుమా
మనసైనప్పుడు గూడు గాఢరతులఁ♦మన్నించుచక్రీస్తనీ॥

సుశీ— (తనలో) హరీ! హరీ!

ధన—

ఉ॥ ఏటికినన్ను గూడ జల♦జేక్షణ సందియమందెదీవు నిం
కేటికి మగండు బంధులని♦కెన్నఁడు జూడవు చిక్కినావు నా
మాటను చిత్తమందునను♦మానము లేకను బాటిసేయుమా
నీటుగ నన్నుఁజేకొనుము♦నీరజపత్ర విశాలలోచనా॥

సుశీ— (తనలో) శాంతభావమున నెంత చెప్పినను ప్రయోజనమున్నట్లు కనబడదు. ఇంచుక పరుషంబుగఁ బలికి చూచెద. (ప్రకాశముగా)

తే॥ గీ॥ చెడుదువని నీకు బుద్ధిని♦జెప్పియుంటి
తులువతనమును బూనినన్♦గలియనెంతె
పామునకుఁగడు ముదమున♦బాలుబోయ
గోపమున గఱచుగతి నీ♦గుణములకట॥

దుర్మతీ! వైశ్యకులంబున ప్రావిర్భవంబంది వంశంబునకెల్ల నపకీర్తి దెచ్చితివే. ఛీ నీముఖంబుఁజూడరాదు.

ధన— కాంతా శిరోమణీ? నాతోనించుక కాలయాపనంబొనర్చుటకా యిట్టి సరసోక్తులాడుచుంటివి?

పంచచామరము.

మనోజుఁడేయుచుండె నిప్డు♦మానినీశరంబులన్
ఘనంబుగాను హాయిగాను♦గాలివీచుచుండెడిన్

గనఁగామదిఁగాముదంబు గూర్పఁ•గాయుచుండెఁ బెన్నెలల్
మనంబునిల్పఁజాల నింక మాటలేలపల్కఁగన్॥

సుశీ— మూఢాత్మా! నీబాగుకై చెప్పినను వినవైతివి. అంతఃపురంబున పరిచారికాజనంబులు వైభవంబునంగొలువనుండు తరిని నన్ను జూచుటకైనను శక్యంబగునా? విధికృతంబున నిట్లడవులపాలు బడి నీచేఁజిక్కి మోసపోతిని. ఒంటరినిగదా యనియు దిక్కులేని దాననుగదా యనియు డెందంబున దలచి నన్నిట్లుకోరుచుంటివా? ఒంటరినని యెన్నడును దలంపకుము. పతివ్రతలగు స్త్రీలకెపుడును దైవంబు తోడ్పాటగుచుండు. ఇంకనైనను నీ బుద్ధి మరల్చుకొమ్ము.

ధన—

ఉ॥ సుందరి నే ననేకులను•సుందరులన్ దిలకించినాను నీ
యందము చందమున్ గలిగి•నట్టి సతీమణి నీజగాన నే
నెందును గాంచలేదెపుడు•నిందుముఖీ నినుఁజూడఁగానె యే
మందును నామనంబుచెడె•నాఁటిడిబెట్టక బ్రోవఁగాదగున్॥

రమణీ! నీవునీభర్తను గలిగియుండు వన్నమాట కలలోవార్త. నాయొద్ద మిక్కిలి ధనమున్నది. నీకేవిధమయిన లోపమును లేదు.

సుశీ— (చింతించుచున్నది)

ధన— నిరుత్తరం బంగీకారసూచకంబా?

సుశీ— ఛీ! యెంత జెప్పినను వినకుంటివి. "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు చేటుకాలము నీకు సంప్రాప్తమైనది. ధాతవ్రాత దప్పింప నెవరితరము?

ధన— కాంతా? వేయేల.

మ॥ కరుణన్ నీయధరామృతంబొసగినన్ ♦ గాపాడిరక్షింతువో
స్మరుఁడిప్పట్టున వేయుబాణములకున్ ♦ జావంగవీక్షింతువో
విరహాంభోధిఁదరింప నావవగుదో ♦ విశ్వంబునన్ వీనికిన్
గరిమన్ బెట్టెదవో త్వదీయరతి బి♦క్షం జెప్పరామామణీ॥

మ॥ గురువుల్ దిట్టిన బంధువుల్ సుజనులున్ ♦ గోపించినన్ మిత్రులున్
బరిహాసంబును జేసినన్ సతియునున్ ♦ భావంబులో గుందినన్
ధరణీపాలుడు శిక్ష జేసినను నా ♦ ద్రవ్యంబు గోల్పోయినన్
దరుణీరత్నమ నిన్ను గూడకికనే ♦ దాళంగ లేనింతయున్॥

నీవిందుకు సమ్మతింపక పోతివేని బలవంతంబుగానైనను నాకోరిక దీర్చుకొందు.

సుశీ— (కోపమున) శ్రుతిమించి రాగంబున బడినదే. దుర్మతీ! వైశ్య కులభ్రష్టా!

చ॥ వనముననుండునట్టిమను ♦ వంశధరాధిపుమోసపుచ్చి భూ
తనయను దెచ్చినట్టియల ♦ దానవుసంగతి యేమియయ్యెనో
ఘనకుతుకంబుతోడనలు ♦ కాంతనుగోరినయట్టి యాకిరా
తునిగతి యేమియయ్యెనో కొ ♦ తోచదెనీమదియిందు దుర్మతీ॥

ధన— తరుణీ? నేజచ్చినను సరే. నాడెందంబు నీయందు జక్కినది.
(గవాక్షము గుండ దూకుటకు ఫ్రయత్నించుచున్నది)

సుశీ— (తప్పించుకొని) అయ్యో కార్యమిమించినది. నన్నీతుచ్ఛుని బారినుండి తప్పించువారెవ్వరు. (పతినుద్దేశించి) హా మనోహరా! నిజసతిని గాపాడుట కిదిగదా సమయంబు. (దైవమునుద్దేశించి) హాకృష్ణా! పాండవపక్షా! ద్రౌపదీమానసంరక్షా! నన్నురక్షింపుము. నీవుదప్ప వేరెవ్వరును శరణంబుగానబడరు. దాసురాలి మొరాలకింపుము.

మ॥ దరిజేర్చంగ గలవాడవీవని విపత్పాథోధియందుండి యా
తరుణీరత్నము సాధ్విద్రౌపదినిను♦ద్దైన్యంబునం వేడగా
గరుణం మానముగాచినట్టి గతినం♦గాపాడవే బ్రోవవే
కరుణాసింధువటంచు జేరితిరమా♦కాంతామనోవల్లభా॥

(ధనపాలుడు మూర్ఛిల్లుచున్నాడు.)

సుశీ— ఆహా యేమియాశ్చర్యము! ఈవైశ్యుండు మూర్ఛిల్లినాడు. మూర్ఛిల్లుటేగాక వీధిలోనికింబోవు ద్వారముతలుపు తెరువబడెను. ఇది వీక్షింప జగద్రక్షకుండగు శ్రీకృష్ణుని మాయగాంగనుపించుచున్నది. దైవబలంబెంతకు జాలదు. (ఆలోచించి) ఈతడు మూర్ఛిల్లియున్నాడు. ఈ గృహంబునుండి తప్పించుకొనిపోవుట కిదియేమంచిసమయము. ముందుగానిక్కడనుండిదాటి యవతలబడినపిదప నేదైనదారిజూచుకొన వచ్చును. (తలుపుతీసికొని వీధిలోనికివచ్చి) ఇప్పుడు రెండుఝాములరాత్రి యైనది. వెన్నెలసిందారబోసినట్లు గాయుచున్నది. ఇంతరాత్రివేళ నేనెచ్చటకేగుదు. ఈసమయంబున నాకుదారిం జెప్పువారెవరు? (దిక్కులుపరికించి) అదిగో యెవ్వరో యిద్దరుపురుషులిట్లే తెంచుచున్నారు.

(భీమన్న రామన్న ప్రవేశించుచున్నారు.)

భీమ— నేడేమిసుదినమో కాని ధనపాలశెట్టిగృహంబులో వలయునంత ద్రవ్యముదొరికినది. ఇక మనమిక్కడ నుండరాదు. త్వరగా పోదమురమ్ము.

సుశీ— (తనలో) వీరెవ్వరోకాని యీ యర్ధరాత్రంబుననిట్లువచ్చుచున్నారు. త్రిభువన రక్షకుండగు రుక్మిణీధవునిపంపున నన్ను రక్షింప నరుదెంచుచున్న మహానుభావులని తోచుచున్నది. (భీమన్ననుజేరి) అయ్యలారా! దిక్కులేని పక్కికరణినున్న నన్ను రక్షింపనరుదెంచిన పుణ్యాత్ములగు మీరెవ్వరో నాయందు గృపబూని చెప్పబార్థించుదాన.

భీమ— ఈయర్ధరాత్రివేళ నీపురంబున సంచరించుచుంటివేల? నీరూపంబుజూడ నీవొక రాజకన్యామణివని తెలియుచున్నది. నీయుదంతంబంతయు సవిస్తరంబుగ దెలుపుము. నీకేమియు భయంబులేదు.

రామ— ఒరే భీమా? యిక్కడమాటలాడుతువుంటే చాలామోసమగును.

సుశీ— సోదరులారా! సత్యపురంబేలు వత్సరాజునకుభార్యను. నాపేరు సుశీల. దాయలచే రాజ్యంబపహరింపఁబడి నేనును నాభర్తయు నరణ్యంబుల పాలయితిమి. మాదురదృష్టంబున మేమిరువురము నెడఁబాయవలసివచ్చె. కావున నాయందుకరుణబూని సుతవాత్సల్యంబునుంజూపి నాభర్తయెక్కడనుండునో వర్తమా

నంబారసి నన్నాయన కడకు బంపగోరెద. దిక్కులేనిదాననై తి. ఈదీనురాలి మొరలాలించి రక్షించిన చో మీకెంతయు పుణ్యము లభించును.

భీమ— (రామునితో) రామా! యెట్లైనను నమ్మకము కలుగజేసి యీమెను మనవెంట దోడ్కొని,పోదము. (ప్రకాశముగా) అమ్మాయీ! నీకేమియు భయంబులేదు. మావాసస్థలంబీపురము నకు గడుసమీపంబుననున్న యొకచిన్నపల్లె. మేమిప్పుడచ్చటికిఁ బోవుచుంటిమి. నీవుమావెంట రమ్ము. నీవచ్చట నుండవచ్చును. మేము నీనాధునివార్త నారసి నిన్నాతని కడకు దోడ్కొని పోయెదము. ఇందుకేమియు నీడెందంబున సందియంబందకుము.

సుశీ— (తనలో) ఇట్టులే చక్కని పలుకులంబలికి ధనపాలుడు వంచించె. వీరివలనగూడ నాకే విధమయిన కష్టంబును సంప్రాప్తిం చదు గదా. (ఆలోచించి) అంతకును నాభగవంతుండగు వసు దేవ సుతుండే సహాయుండు.

భీమ— అమ్మాయీ! సందియం బందుచుంటివేమి? నీకేమియు భయంబులేదు. మాప్రాణంబులతో సమానంబుగా గాచెదము. పోదమురమ్ము.

సుశీ— అన్నలారా! మీకెంతయు పుణ్యము లభించును.

భీమ— పోదమురమ్ము.

(నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయరంగము—అరణ్యము.

(భీమన్న రామన్న సుశీలయు ప్రవేశించుచున్నారు.)

**సుశీ**— (చోరులనుద్దేశించి తనలో) ఎందుచేతనోగాని వీరు ప్రక్క ప్రక్కలంజూచుచు భయముతో నడచుచున్నారు. వీరునాయెడల దుర్మార్గమును దలచి నన్ను మోసపుచ్చి తీసికొనివచ్చుట లేదుగదా.

**భీమ**— చిలుకల కొలికీ! ఏమేమో యాలోచించుచున్నట్లున్నావు?

**రామ**— ఈకాంత మనకు దక్కినదిరా!

**సుశీ**— (తనలో) వీరింజూడ నాకెందుచేతనో గాని డెందంబున సందియం బగుచున్నది.

**భీమ**— అతివా! పురంబును సమీపించు చున్నాము. భయపడకుము.

**రామ**— కాంతా! మే మనేకరాజకన్యలను జూచినాము కాని నీయందంబుగల కుందరదనను నెందును జూడలేదు.

మ॥ పడతీనీదు నొయారమాహొయలు సొం♦పా నీటులా గోటులా
విలసత్పూర్ణ శశాంకబింబ సమమై♦వెల్గొందు నీమోమునుꣳ
బెడగావైఖరు లేమి లెక్కగనగా♦బెంపొందు చున్నట్టి నీ
నడలే సేయు పదారువేల వరహాల్♦నారీశిరోరత్నమా॥

నిన్నుజూడగనే మాహృదయంబు (అర్ధోక్తియందు)

**భీమ**— ఆ! ఆ! ఆ!

రామ— సుశీలా! మావెంట రానేవచ్చితివి. ఇక నీచిత్తము మా భాగ్యము.

సుశీ— (తనలో) వీరిమాటలు నాకేమియు నర్థంబు గాకుండె. వీరు చూడఁగాగిరాతులవలె గానుపించుచున్నారు. వీరివలన నాకే యపాయం బొనగూడునో గదా!

రామ— అబలా! చల్ల కరుదెంచి ముంత దాచనేల? మాసంగతి దెలిపెదము వినుము. మే మిచ్చటికి గొంత దూరంబులో నున్న కొండలోయలలో నివసించుచున్నాము. చౌర్యంబు మా వృత్తి. నిశ్చయముగా నిన్నువంచించి తోడ్కొని వచ్చితిమి. యెచ్చటికో పోయిన యావత్సరాజునకై పరితపించెద వేల? మావద్ద ధనంబునకేమియు లోపంబులేదు. నీవు సుఖంబుగా మాయింటియొద్ద నుండుము.

సుశీ— (దైవంబునుద్దేశించి) అక్కటా! కిరాతుని గృహంబునుండిశీల భంగము గాకుండ దప్పించు కొంటిని గదాయని దలంచి నా ధునెట్టులైనను గలియుటకు సంతసించుచుండ నన్ను మరల నీ కిరాతులహస్తంబులను జిక్కచేసితివా! నన్నీరీతి బిడుమలు గుడుప నేను నీకేమి యపకారం బాచరించితి? (కిరాతులనుద్దే శించి) అయ్యయ్యో! ఈ ఘోరారణ్యంబున నన్ను వీ రేమి సేతు రోగదా. అకటా మోసపోతిని.

తే॥ గీ॥ ధవుని వార్తను నారయ • దారి గాను
పించు నించుక మదిని వీ•క్షించిచూడ

నీకిరాతులవంచించి♦యేగుటకును
దారిగాన్పింపదే దారి♦దరలుదాన॥

ఏప్రక్క వీక్షించినను లెక్కకొక్కమానవుడును గానుపించు టలేదే.

రామ— నారీ! ఏదీ? నీహస్తంబు నాచేతి కిమ్ము. ఇరువురమును జంటగాగలిసి నడుతము. (అని సుశీలహస్తంబును పట్టుకొొని బోవుచున్నాడు.

సుశీ— (తప్పించుకొొని) నేను వీరికేమియు జెప్పఁగూడదు. ఏమన్నను తాళవలయును. ఇంచుక కాలంబుగడచినచో నెవ్వరైనను బాటసారి రాకుండునా!

భీమ— పడతీ! అదుగో సూర్యుండు తనవేడికిరణంబులను ప్రసరించుచున్నాఁడు. మనము త్వరగాబోవలెను.

విశారదుడు— (ప్రవేశించి) (తనలో)

ఉ॥ అలసితి మిక్కుటంబుగను♦నక్కటవేఁటలనాడి యాడి యిప్పుడెవెన పట్టణంబునకుఁ ♦ బోవఁగఁజాలను గాన నిచ్చటన్
తడవొకయింత తాళి సుఖ♦దంబగు నిద్రనుగొంత జెంది నా
బడలిక దీర్చుకొొందు నిఁకఁ ♦ బట్టణ మంతటఁ జేరగల్గుదున్॥

(వృక్షంబునీడను విశ్రమించుచున్నాడు.)

ఆహా! యేమి యీసౌఖ్యము!

తే॥ గీ॥ ఒక్కరీతిగఁ బాలమున♦దుక్కిదున్ని
శ్రమపడుచునుండు రెడ్డిసం♦సారి యెఱుగు
గాని కమ్మగాలి సౌ♦ఖ్యంబు నన్నుఁ
బోలినట్టిధరణి పుంగ♦వున కెఱుకయె॥

భళిరా! నామనం బిప్పుడెంతయు హాయిగ నున్నది. (ఇంచుక యూరకుండి) రాజులు రాజులనుటయే గాని రాజులకుండు చింతలు లెక్కింపతరంబా? నాసోదరి సరసాంగి స్థితికేమని చింతింతు. వత్సరాజుని దప్ప మఱొక్కరిని వివాహమాడనని దీక్షవహించినది. ఆవత్సరాజు రాజ్యభ్రష్టుడై కాంతా సమేతంబుగా నరణ్యంబుల పాలయ్యెనని చెప్పినను వినదయ్యె. వత్సరాజునకై యనేక చారులను బంపితిమి గాని యెచ్చటను గానుపింపడయ్యె. యేమిసేయుదు?

రామ— మానినీ! మాసంగతి యేమిచెప్పితివి?

సుశీ— (తనలో) అయ్యో! నన్నీ సమయంబున రక్షించు వారెవరు. కృష్ణా! జగద్బాంధవా! నాదుఃఖం బంతంబులేనిదిగాఁ జేసితివి గదా!

మానిని

ఏమని యాపుదు పొర్లెడి దుఃఖము♦నీగతిజెందితి నక్కట నే
నేమని దూఱుదు దైవము♦యిచ్చటి కెవ్వరు కావఁగవచ్చెదరో
నామది యందున ధైర్యమునిల్పదు♦నన్ను గృపన్ దిలకింపుమికన్

శ్రీమహనీయగుణాకర వేడ్కను॥ చింతన జేతు రమారమణా॥

రామ— సఖీ! నన్నుఁజూచి దూరముగా దొలగెదవేల? మాహస్తంబులోఁజిక్కిన నీవెచ్చటికేగ గలవు?

సుశీల— (తనలో) అయ్యో! యిప్పుడేమి జేతును!

(రామన్న భీమన్నలు ముందు నడచుచున్నారు. సుశీల కొంచెము వెనుక నడచుచు)

బాటసారులెవ్వరును వచ్చుచున్నట్లు లేదు. (దిక్కులుపరికించి) అదుగో! యిచ్చటికించుక దూరమున నున్న నా వటవిటపిక్రిందనొక్క పురుషుం డాయుధహస్తుడై విశ్రమించి యున్నాడు. నేను కేకలు వేసినచో యతండేతెంచు లోపుగా వీరునన్నేమియు సేయ లేరు.

ఓ మహానుభావా! కిరాతుల చేజిక్కిన నన్ను రక్షింప సత్వరంబుగరమ్ము.

(అనియరచుచున్నది.)

విశా— ఇక్కడకు కడుదవ్వున నొక్క స్త్రీరవంబు వినవచ్చుచున్నది. పాపము! ఎవ్వరో యొక్క స్త్రీ విపదబ్ధినుండి యెవ్వరైన బాటసారులడ్డపడుదురని కేక లిడుచున్నది. (లేచి యించుక నడచి) అదుగో ఆపురుషుల హస్తంబునం జిక్కి తప్పించుకొనుట కిట్లు విలపించుచున్నది. (వడిగానడచి కిరాతులను సమీపించి)

చం॥ ఎవడవు రోరి నీచమతి♦నిట్లుకిరాతగుణంబుఁబూని యీ
పరివిమల గాత్రినిక్కడికి♦ వంచనఁజేసియు దెచ్చినావహో

రాము— ఒరే! కొంప మునిగినది. కాలికి బుద్ధిఁజెప్పెదము. (ఇరువురును పరుగిడుచున్నారు)

విశా— (కిరాతుల వెంట బరువిడుచు)

దవుదవు మంచు బర్విడుట♦ధైర్యమెదర్పము జూపనెంచుఁడీ
జవమును దూల్చ నెంచితిని సజ్జను లెల్లరు మోదమందగ॥

(నిష్క్రమించుచున్నాడు)

సుశీ— (తనలో ఈపుణ్యాత్ముండెవ్వరో గాని నన్నురక్షింప నెంచినాడు. (ప్రక్కంజూచి) అదుగో యొక్కకిరాతుని నంతకుని గృహంబున కతిథిగాఁజేసి యిచ్చటి కేతెంచుచున్నాఁడు.

విశా— (ప్రవేశించుచున్నాఁడు,)

సుశీ— (విశారదునితో) మహానుభావా! ఈకిరాతులచే జిక్కి నట్టడవిని విలపించుచున్న నన్ను రక్షించుటకు కారుణ్యంబుఁబూని సత్వరంబుగ నరుదెంచిన పుణ్యపురుషుండవగు భవన్నామాంకితం బెట్టిదో దయచేసి యీసోదరి కానతిత్తురా?

విశా— సోదరీ!
తే॥ గీ॥ విజయధామ పురంబేలు♦పృథ్వీపతికి
సత్కుమారుండ పేరు♦విశారదుండు

వేఁటలాడియలసియుండ♦విశ్రమించి
యుండి, నీవిలాపంబును♦నువిదవింటి
నిన్నురక్షింప గంటిని♦నీరజాక్షి॥

కం॥ నీచరితంబుసమస్తము
దాఁచక యిపుడే వచింపు తథ్యంబుగనా
లోచింపఁగఁబనియేటికి
నాచేతనగు పని వేగ నాతీ సేతుఁ॥

సుశీ—— సోదరా! నాయుదంతంబంతయు దెలిపినచో నీకు దుఃఖదాయకంబుగ నుండును. అయినను నాయందు సోదరవాత్సల్యంబుబూని వినఁదలచి యడిగితివి గాన లజ్జవిడిచి చెప్పదొరకొంటి. నేను శ్రీ నికేతనపురీశుండగు జయధ్వజుని పుత్రికను. నన్ను సుశీల యందురు.

విశా——(తనలో) వెదకఁబోయిన తీగ పదములబడిన ట్లిప్పుడీమె నిచ్చట గాంచగలిగితిని. వత్సరా జేమయ్యెనోగదా. తొందరపడనేల. (ప్రకాశముగా) సోదరీ! చెప్పుము.

సుశీ—— వత్సరాజును బెండ్లియాడిన కొన్నిదినములకు మాతండ్రిచే రాజ్యం బపహరింపబడి యడవుల పాలయితిమి. ఇట్లిరువురమును నరణ్యంబున జరించుచు గొన్నిదినంబులకు భానుమంతుని పురిదరికి జేర నచ్చట నొక్క వృక్షంబుకడ నన్ను విడచి మత్ప్రాణేశుండు పురంబులోనికి భోజనపదార్థంబులు దెచ్చుటకేగె. ఆతండేగిన కొంత సేపటికి ధనపాలుండను వైశ్యుం డరుదెంచి

నాథుని యుత్తరీయంబు నానవాలుగాఁజూపి నన్ను నానాథుండు దోడ్కొని రమ్మని చెప్పెనని వంచించి తోడ్కొనిపోయె. అచ్చట మన్నాథుండు లేకుంటఁగాంచి చిత్తంబున మిగులబాగిలితిని గాని యచ్చటనుండి తప్పించుకొని యవతలఁ బడు మార్గంబుఁగాంచనైతి. ఇట్లుండ నొక్కనాఁడా వైశ్యుండరుదెంచి నన్నుగాంచి (తలవంచి కన్నీరు నించుచున్నది)

విశా— సోదరీ! సకలమ్మును దెలిసినది. విచారింపకుము. (వైశ్యు నుద్దేశించి) ఛీ! దుర్మతీ! వైశ్యకులంబునకెల్ల నపకీర్తిఁ దెచ్చితివే. పతివ్రతలగు నారీరత్నంబులఁ గోరుటకేనా ధాత నిన్నుసృష్టించి నాఁడు!

సుశీ— అంతట నేను నాగతికిఁజింతించి భగవంతుని వేఁడుకొన నావైశ్యుండెందు చేతనో కాని నేలంబడి మూర్ఛిల్లినాఁడు. అప్పుడా భవనంబునుండి వీధిలోనికిఁబోవు ద్వారముగూడ దానంతట నదియే తెరువఁబడెను. ఇది ముకుందుని మాయగా నెంచి యావైశ్యభవనంబును విడిచి యివతలికి వచ్చితి.

విశా— (తనలో) పతివ్రతయను మాట యీమెకే చెల్లును. (ప్రకాశముగా) తరువాత!

సుశీ—అప్పుడు రెండు ఝాముల రాత్రియయ్యెను. ఆసమయంబున నేనెచ్చటికేగుదునాయని చింతించుచుండ నీకిరాతులాదారిని బోవుచుండ వీరి సంగతి దెలియక వీరిని వేడుకొంటి. వీరు గోముఖ పుండరీకంబులభాతి నమ్మకంబుఁబుట్టించి నానాథుని వార్తనా

రసెదమనియు, నంత దనుక తమపురంబున నుండవచ్చుననియు జెప్పుటచే సత్పురుషులని తలంచి వీరిని వెంబడించితి. రాను రాను దారియందు వీరిసంగతిఁజూడ గోచరంబయ్యె. వీరివల్ల నాశీలభంగము గాకుండ భగవంతునివలె నీవడ్డుపడితివి. నీఋణంబెట్లు దీర్పగలను. నాచేతనైన నొక్కనమస్కారంబుదప్ప వేరేమియు జేయ జాలను.

విశా—తరుణీమణీ! వత్సరాజు రాజ్యభ్రష్టుడై నాడనియు, మీరిరువురును గూడనరణ్యంబుల పాలయితిరనియు మేమిదివఱకే విని చింతించితిమి. ఇప్పుడు నీవును వత్సరాజును వేరువేరు మార్గంబులను బడిరన్న వార్త నీవల్లవింటి. ఇదియంతయు నాకు గాని చూపరులకుగాని దుఃఖ భాజనంబని నే నొక్కి చెప్ప నక్కఱ లేదు. వైశ్యునియింట శీలభంగము గాకుండ నిన్నురక్షించిన నందనందనుండెంతయు వందనీయుడు. ఆతని కృపవలననే నీవెన్నియిక్కట్లు పడుచుండినను శీలభంగము గాకుండ గాపాడుకొనుచుంటివి. పతివ్రతల కెప్పుడును దైవబలంబే సహాయంబని పెద్దలు వక్కాణించు వాక్కులు మిథ్యలగునా? ఇంతకును నేజెప్పఁబోవు సంగతిఁ బూర్ణముగా నాలింపుము. ధైర్యంబుఁ బూనుము. నీకేమియు భయములేదు. వత్సరాజు నారసి యాతనితో నిన్నుగలుపు భారంబు నాభుజస్కంధమునందు బెట్టుకొందు. వత్సరాజు కొలదిదినంబులలో నేక్రమ్మర రాజ్యాభిషిక్తుఁడైసుఖంబుల నందఁగలఁడు. నీవిప్పుడే పురుష వేషంబును ధరించి విజయధామపురంబున కేగి యచ్చట మాతండ్రిగారి మంత్రియ

గు ధీమణి సౌధంబున కేగి యాతనిపుత్రుండగు సుబుద్ధింగాంచి నాకన కాంగుళీయంబొనవాలుగా జూపి నీవునాసఖుండ వనియు నేనువచ్చువఱకు నీగృహంబున నుండుమని చెప్పితిననియు జెప్పుము. అతండు నిన్నెంతయు గౌరవంబుగఁ జూచును. ఇందుల కేమియుసందియంబు లేదు. నిన్నెవరైన నీనామంబడిగి రేని కమలాప్తుడని వచింపుము. నేనునునిప్పుడే భానుమంతుని పురి కేగి వత్సరాజు జాడల నారసివచ్చెద. నీవచ్చట స్త్రీగుణంబులు బయలుపడనీక ప్రచ్ఛన్నవేషంబునఁ జరింపలయును. ఇవిగో నాదగ్గిరనున్న పురుషదుస్తుల ధరింపుము.

(తనవద్దనున్న దుస్తుల నిచ్చి) ఇకపోయిరమ్ము. నేనిదేపోవు చున్నాడ. (నిష్క్రమించుచున్నాడు.)

సుశీ— ఆహా! యీాతండు చెప్పిన మాటలు నమ్మవచ్చును; కానిప్ర చ్ఛన్న వేషంబున నెట్లువర్తింతునో దెలియదు. ఆవాసుదేవుడే సహాయుండై బరగుగాక. ఇకవిజయధామపురి కేగెద. (నిష్క్ర మించుచున్నది)

తృతీయాంకము సంపూర్ణము.



శ్రీ

# సుశీలనాటకము.

చతుర్థాంకము.

శ్రీమణిసౌధము.

కమలాప్రవేశము.

కమ— మ॥ ఇదిగోవచ్చెదనంచుమున్ బలికిదా ♦ నిందాక రాడయ్యెనే
పదినాళ్లాయె విశారదుండరిగి నా ♦ ప్రాణేశు జాడ౯ గన౯
హృదయేశుండగు పట్టెడో యకటదా ♦ నెచ్చోటికిం బోయెనో
మదిలోదోచదికేమిసేయుటకునున్ ♦ మద్భాగ్యమెట్లున్నదో॥

అయ్యో! ఆవిశారదుండు నాథుని గాంచలేకుండెనేమో. ఒకవేళ నాథుండగపడకుండుటచేత మనంబున విసుకుజనించి తనకార్యములపై నెచ్చటికైన నేగెనేమో. లేక నాథుని గుర్తింపలేకపోయెనేమో! వత్సరాజు నెఱుగనివారీ ధరాతలంబునం గలరా?

(భర్తనుద్దేశించి)

మ॥ ధనము౯ రాజ్యములేక పోయినను నీ♦దాస్యంబు నేవీడనం
చును జిత్తంబుననెంచి యుంటి నకటా♦చూడంగనన్నొంటిగా
ఘనబాముల్ పడుమంచునాద్దునోసట౯♦గారుణ్యము౯ లేకయా

వనజాతోద్భవుడిట్లు వ్రాయుననుచుఁ • భావింపనైతిఁ మదిఁ॥

మనోరమణా! అలనాడు సత్యపురంబున « రమణీ! యెన్నియిక్కట్టులు సంభవించినను నిన్నువిడనాడ" నని చెప్పలేదా? ఆపల్కులిప్పుడు మఱచితిరా?

క౦॥ నినుబాసి యుండనంచును
ఘనబాసను జేయలేదె• కరుణామతివై
నను బాసియుంట యిపుడుఁ
ఘనమా నీకిదిదలంప•కరుణాభరణా॥

వసుధావృత్తము

ఘనమా గనంగా। వనితఁ విడగన్
గనవా కృపతో। మనవిఁ వినుమా॥

అకటా మిమ్మునిందింపనేల? ఆదుర్మతుండగువైశ్యుండే మనల వంచించె. మనోహరా! శరదిందు సమానమగు మీసుందర వదన సందర్శనంబెప్పుడబ్బు? (విశారదునుద్దేశించి) విశారదుండు నను బ్రచ్ఛన్నవేషంబున నుండుమని జెప్పినాఁడు ఇంకెన్నాళ్లిట్లు వర్తింపఁగలుగుదు ? ఆతండింత వఱకును రాఁడయ్యె.ఎవరితో జెప్పుకొందు?

సుబు— (ప్రవేశించి) ఓహో మిత్రమా ! నీ వుద్యానవనంబున కేగితి వనితలంచి యచ్చటికిఁబోయి వచ్చితి.

కమ— (తనలో)నే ననుకొన్న మాటలన్నియు నితఁడువినలేదుగద్దా!

(ప్రకాశముగా) మిత్రమా ! కూర్చుండుము.

సుబు—(కూర్చుండును)

కమ— మిత్రమా! నీచేతనుండు కాగితంబేమి?

సుబు— ఇదియొక యాజ్ఞాపత్రిక, ఇది రాజుగారిచేత మంత్రియగు మాతండ్రిగారికిఁ బంపఁబడెను. చూడుము.

కమ— సఖా! నీవే చదువుము.

సుబు—అమాత్యవర్యా! ధీమణీ! నేను చిరకాలంబు సంతానరహితుండనై యా పరమేశ్వరానుగ్రహంబున పుత్రుండగు విశారదుని పుత్రికయగు సరసాంగిని గాంచితినన్నసంగతి నీవెఱిఁగియేయుంటివి.ఆ సరసాంగి వత్సరాజునుదప్ప మఱెవ్వరిని బెండ్లియాడనని దీక్షఁబూనిన సంగతియు నీకెఱుకయే. ఇప్పుడా వత్సభూపతి రాజ్యభ్రష్టుఁడై నిజాంగనా సమేతంబుగా నరణ్యంబులపాలయ్యెనని విని తదన్వేషణార్థంబై పెక్కుమంది చారుల ననేకదిక్కులకుఁ బంపితిమిగాని యింతవఱకును నాతని యుదంతంబెచ్చటను గన్పట్టదు. కొన్నిరోజులుక్రిందట మా సౌధంబున కెచ్చటనుండియో యొక్క రాజకుమారుం డరుదెంచి నాఁడఁట.అతనిని మదీయసుత తనసౌధముముందునుండి యేగుచుండగాఁ గాంచినంతనే తనమనంబారాజకుమారునియందుఁ జిక్కినదనియు,వత్సరాజుకనుబడ కుండుట చేతను, నారాకుమారుండు వత్సేశునితోఁదుల్యుడుగాఁగనుపట్టుటచేనాతనిని వివా

హామాడుదునని చెప్పె. కావున నీవా రాజకుమారుని వెంటఁబెట్టు
కొని నాయొద్దకురమ్ము. తక్కినసంగతులన్నియు సమక్షము
నందు ప్రశంసింతము.

ఇట్లు, గోపాలవర్మ వ్రాలు.

కమ— (నవ్వును)

సుబు— మిత్రమా! నీవు కడునదృష్టవంతుడవు.

కమ— (తనలో) ఆ విశారదుండు వత్సరాజుజాడలరయుట సరసాం
గిని పెండ్లిగావించుటయేయని నాయూహ. కనుక నేయాతడు
నాయొద్ద నీసంగతియేమియుం దెలుపక నన్నిచ్చటికింబంపినాఁ
డుకాఁబోలు. (ప్రకాశముగా సుబుద్ధితో) సఖా! మీరునాకు
మిత్రులగుటచేతను, నేను మీయింటనుండుటచేతను నాకిట్టి
భాగ్యంబులభించె. కాని, మొదటనామె వత్సరాజును వివా
హంబాడెదనని వహించినదీక్షవీడి నన్ను వివాహమాడెదనని
చెప్పుట కేవలముతప్పు. మొదట తనమనం బెవ్వానియందుఁ
జిక్కునో వానినే వివాహమాడుట పతివ్రతలకు లక్షణము.

సుబు— రాకుమారా! నీవువచించిన సంగతి నిక్కంబె. కాని వత్సరా
జు కనబడకుండుటచే నాతనియందున్న యాసవీడెనుగదా.

కమ— ఆతనిజాడ దెలియుట లేదనికదా వార్తావాహులుచెప్పిరి. ఆత
ని యుదంతంబు పూర్ణంబుగాఁ దెలియునంతవఱకు నీప్రయ
త్నంబును బూనగూడదు.

సుబు— మనమిప్పుడు రాజసభకు బోవలెను రమ్ము.

కమ— అట్లనే కానిమ్ము. (ఇరువురు నిష్క్రమించుచున్నారు)

## ద్వితీయ రంగము.

(గోపాలవర్మ, ధీమణి, సుబుద్ధి, కమలాప్తుడు.)

గోపా—అమాత్యవర్యా! ధీమణీ! నిన్న నేఁబంపిన లేఖం దిలకించితివా?

ధీమణి—దేవా! చూచినాను. ఆలేఖను సుబుద్ధికిచ్చి యారాజకుమారునకుఁ జదివి వినిపింపుమని చెప్పితి.

కమ— రాజేంద్రా! ఆలేఖను నేను బరమాహ్లాదంబుతోఁ గంటి. వత్సరాజునే పెండ్లియాడుదునని దీక్షవహించిన మీపుత్రీరత్నము నన్ను వివాహమాడనెంచుట మంచిదిగాదు. స్త్రీలకు శీలమే ప్రధానము. తనమనంబునఁజిక్కిన వరునివిడిచి యొండువరుని వివాహంబాడుట పతివ్రతకు లక్షణంబుగాదు. ఇంతకును వత్సరాజు నిజవర్తమానంబు దెలిసినపిదపఁగదా యీప్రయత్నంబును సేయవలయును.

గోపా— (ధీమణితో) ధీమణీ! వత్సరాజు సమాచారంబేమైనఁ దెలిసినదా?

ధీమ— భూపాలా! పెక్కుచోట్లకుఁబంపిన చారులందఱును వచ్చి వత్సరాజు సమాచారంబు దెలియలేదని చెప్పినారు. ఇప్పుడొకచారునివలన వత్సరాజు మనపురంబున వణగ్వీధిలో సంచరించుచున్నట్లు దెలియవచ్చినది. నిజమునారయుటకై యిద్దఱుచారులను బంపినాను.

కమ— (తనలో) డెందమా! తొందరపడకుము. నాథుండు కడు సమీపములోనే యున్నాడనిగదా వింటివి.

గోపా— (కమలాప్తు నుద్దేశించి)

" ఎయ్యది కాపురం బభిద♦యెయ్యదియెవ్వరునీదుతండ్రి నీ
వియ్యెడ కేల వచ్చితివి♦కెన్నిదినంబులు నిల్తువ్రాగతం
బెయ్యదియేపురంబునకు♦నేగెదవిచ్చట నుండి తేటగాఁ
జయ్యన తెల్పుమా వినఁగ♦నంతసమయ్యెను రాకుమారకా॥

కమ— రాజేంద్రా! వర్తమానంబున నానిజగోత్రనామంబులు గుప్తపఱచి కమలాప్తుండనునామంబునఁ దనరుచున్నాఁడ. నాసంగతినంతయు భవత్సుతుఁ డరుదెంచి తెల్పును. అంతవఱకును దెల్పనందుకు క్షమింపఁగోరెద.

గోపా— రాజనందనా! నీ నిజగోత్రనామంబులు దెలుపుటకు నా సుతుండు రావలెనా? నీ చరితంబంతయు వింతగనున్నదే!

కమ— దేవా! నిశ్చయముగా నా చరితంబంతయు వింతగనే యుండును.

సేన— (ప్రవేశించి)
తే॥ గీ॥ తనశరీరంబునిండరు♦ద్రాక్షమాల
లెలమిధరియించివాకిట♦నిలచియుండె
నపరశివుఁడాయనఁగనొక్క♦యతివరుండు
మిమ్ము దర్శింప భావించి♦మేదినీశ॥

గోపా— శీఘ్రంబుగ లోపలికిఁ బ్రవేశ పెట్టుము.

వత్స— (ప్రవేశించి తనలో) ఆ విశారదుం డిచ్చటి కేగుమనిగదా నాకుఁజెప్పినాడు. మునివేషంబుననున్న నన్నెవ్వరును నాన వాలుపట్టలేరుగదా. ఈరాజేంద్రుండును నేనును సములమయ్యు నీతండుబిలువకుండ ,నీతనిసభకు రావలసివచ్చెనుగదా. ఆయ నను బ్రచ్ఛన్న వేషంబున గదా వచ్చితి!

(అందఱును లేచి నమస్కరించుచున్నారు)

గోపా— మహానుభావా! ఈయాసనం బధిష్ఠింపుఁడు.

వత్స— (కూర్చుండును)

గోపా— (యతి నుద్దేశించి)మహాత్మా! త్రిజగత్పూజితా!

ఉ॥ ఈవిధిమీరునాకడకు♦నిప్డుడువచ్చుటఁజూడఁగా గడున్
బావనమయ్యెమందిరము♦వంశముబంధులు మిత్రులెల్లరున్
భూవలయంబునందునీకఁ♦బొం దెదఁగీర్తినిమీదుసత్కృపన్
శ్రీవనితామనోరమణ♦చింతన తాపసనాథచంద్రమా॥

కం॥ ఎచ్చోటనుండి యిటు మీ
రెచ్చోటికినేగుచుండి♦యివ్విధమ్మున మీ
రిచ్చటకున్ వచ్చితిరో
సచ్చరితా చెప్పుఁడయ్య♦సల్పుదునతులన్॥

మహాత్మా! నానారాజ కిరీటాలంకృతంబగు భవత్పాదారవిందరజంబు నాశిరంబునకుం దగులుటచే నాజన్మంబెంతయు సార్థకంబయ్యె. కరుణించి తమయభీష్టంబు దెలుపంగోరెద.

త్స— రాజేంద్రా! తాపసులకుఁగావలసిన దేమియుండును? మాకేమియు నక్కఱలేదు. నీవు నిరంతర భగవద్ధ్యాన పరాయణుండవనియు, సకలలోక సౌఖ్యాన్వేషణ తత్పరుండవనియు, నిరుపమజ్ఞాన సంపన్నుండవనియు, బాంధవరక్షణ నిదానుండవనియు, విని నిన్నుఁజూచి యాశీర్వదించి జనవలెనను కుతూహలంబు దప్ప వేరేమియుఁగోరిక లేదు.

మ— (తనలో మునినుద్దేశించి) ఈతండొక యపూర్వ తేజశ్శాలివలెఁగానుపించుచున్నాఁడు. ఈతనికంఠస్వరంబెప్పుడో వినినట్లే యుండెనుగాని యెచ్చటవింటినో జ్ఞప్తికివచ్చుట లేదు. (వత్సరాజుని క్రీగంట వీక్షింపుచున్నాఁడు)

త్స— (కమలాప్తునితో) రాజకుమారా! పెద్దగడ్డంబును జడలును గలిగి చూపరులకు భీతిగొలుపు నారూపంబునందే నీచూపులఁ బ్రసరింపఁజేయుచుంటివేల?

కమ— యోగీశ్వరా! దివ్యప్రభావముగల్గి యపరశివుండోయనసొప్పు మీ మూర్తి నాపైచూడ్కులు నిగుడించుట యది యొక యక్కజమా!

వత్స— నన్ను దేచూపునఁ జూచుటవల్ల నీకుఁ బ్రయోజనమేమి?

కమ— నిక్కమైన తాపసులు రాజాస్థానములు చేరుటవలన లాభ మేమి?

వత్స— (కోపమున) ఏమీ! నేను నిజమైనతాపసినిగానని నాతో వేళాకోళములాడుచుంటివా? నా తపోమహిమ గనిపెట్టఁగలిగి నంత సామర్థ్యము నీయొద్దనున్నదిగా!

గోపా— (మునితో) మునిపుంగవా? బాలుండాడినవల్కులు లెక్క గొని యాగ్రహింపకుఁడు. (కమలాప్తునుద్దేశించి) కమలాప్తా! తాపసులతో నీకేమిపరియాచకంబు?

కమ— (యతినుద్దేశించి) మహానుభావా! నిజంబైన తాపసులకింత యాగ్రహంబుండదని చెప్పుదురే. తాపసులు శాంతమూర్తులని విందు. ఆగుణంబు మీయొద్దఁ గానుపింపదు.

వత్స— ఏమంటివి? నాది క్రోధగుణమా! క్రోధముగలిగిన మునీంద్రు లెందఱులేరు? విశ్వామిత్రుని నామంబు వింటివా?

కమ— ఓహో! అట్లయినచో మిమ్ము కలియుగ విశ్వామిత్రులనియే పిలువవలయు.

వత్స— (తనలో) ఈతడు నన్ను వేళాకోళములాడ సాగించినాడే! నన్నానవాలు పట్టలేదుగదా. ఈతని కంఠస్వరంబుజూడ నీత డును నేనును బహుదినంబులు సఖులమైయున్నట్లు స్ఫురంచుచు న్నది. కాని యితండెవ్వరో తెలియకుండె. (విశారదు నుద్దే శించితనలో)విశారదుండఱు డెంతునని చెప్పియింతవరకు రాలేదు.

కమ—

కం॥ నీనడతను జూడఁగ నో
మానివరా నామది నను♦మానము వెడమెన్
నీనిజము నెల్ల తప్పక
పూని వెఱింగింపుమయ్య♦మొక్కెద నిపుడున్॥

వత్స— (తనలో)

తే॥ గీ॥ ఇతనిమాటతీరునుజూడ♦సతియటంచు
బుద్ధిపుట్టును గాని యీ♦మోముజూడ
పురుషుడేయటంచును భ్రాంతి♦పొడముఁగొంత

(కమలాప్తునిజూచి)

సందియంబంద నేటికి♦డెందమందు
పురుషుఁడేకాఁడు కాఁడని♦బుద్ధిపొడము॥

నిశ్చయంబుగ నీతడు కాంతయే. సందియంబేమియు లేదు. అది యునుంగాక మాటలతీరును ముఖవైఖరియుజూడ నాకాంత వలెనే గానుపించుచుండె. నేను మునివేషంబు ధరించినట్లే యీమెయుఁ బ్రచ్ఛన్నవేషంబున నాజాడ తెలుసుకొంటకై యిక్కడ నుండనోపు.

కమ— (తనలో) ఈయతీశ్వరుని మాటలుచూడ మన్నాథుండని తోచుచున్నది. నిజము తెలియుటకేయిట్టి ప్రసంగంబాచరించు

చుంటి. నానాథుడనుట కేమియు సందియంబు లేదు. (ఇంచుక యూరకుండి) డెందమా! తొందరపడకుము. ఇంచుక కాలం బోపిక పెట్టుము. (ప్రకాశముగా) మహాత్మా! మీరునిశ్చయంబుగా మునులుగారనినొక్కి-వక్కాణింతు. మీరు రాజవీరులుగ నాకుఁదోఁచుచున్నది. కొండొకకార్యార్థమై నిజగోత్రనామంబులు గుప్తపఱచి యిట్టిమౌనివృత్తి నవలంబించితిరని దోఁచుచున్నది.

వత్స— ఇంకనుసందియంబేమి? ఈమె నిశ్చయంబుగ మదీయకాంతయే. అదుగో కుడికన్నుదగ్గిరనున్న పుట్టుమచ్చయే తెలుపుచున్నది. (సంతోషంబున)

మ॥ భళిరే కాంచితిఁగాంచితిన్ గుణమణిన్ ♦ భామాశిరోరత్నమున్
జలజాతేక్షణఁ బద్మగంధినవలన్ ♦ జక్రస్తనిన్ నీలకుం
తలవిభ్రాజితబూర్ణచంద్రనిభ ♦ వక్త్రన్ నాసుశీలాసతిన్
విలసద్విష్ణుపదాబ్జచింతనపరన్ ♦ విద్యుల్లతాభాధరన్ ॥

తే॥ గీ॥ అర్ధరాత్రంబునందున ♦ నడవియందు
జనెడిపాంథుండుదీపాళి ♦ గనినభంగి
నాదుమానసంబిప్పుడా ♦ నందమొందె
కామినీమణి గనులారఁ ♦ గాంచగానె॥

(కమలాప్తుని దరికింజేరి) సుశీలా! సుశీలా! (అని మూర్ఛిల్లఁ బోవుచుండఁగా విశారదుండరుదెంచి వత్సరాజును బట్టుకొనుచున్నాఁడు.)

విశా— ఏ త్సేశ్వరా? యేమి యీతఁడెందర? (గోపాలవర్మకై జూచి)

ఉ॥ ఈతఁడెసుండువత్సపురి♦నేలెడుభూపతివత్సరాజు వి
ఖ్యాతగుణాకరుండుతిౘిజ♦గన్నుతవీరుఁడు శౌర్యశాలి వి
ద్యాతిశయప్రభావుఁడుగు♦ణాఢ్యుఁడుసంతత ధర్మశీలుఁడా
శ్రీతరుణీమనోరమణ♦చింతనుఁడుత్తముఁడీతఁడెన్నఁగఁ॥

తే॥ గీ॥ ఇచటఁగమలాప్తుఁడను పేర♦ఁనెగడుచున్న
యితఁడుపురుషుఁడుగాఁడయ్య♦యెన్నఁగాను
శీలగుణములుగల్గుసు♦శీల వత్స
రాజురమణీశిరోమణి♦రమ్యచరిత॥

( సుశీల పురుష వేషంబును విడుచుచున్నది )

గోపా— (ఆశ్చర్యమున) ఆహాయేమి! ఈతఁడు వత్సరాజును నీమె
సుశీలయునా! మనభాగ్యంబు చెప్పవచ్చునా!

సుశీ— (వత్సరాజునకు నమస్కరించుచున్నది).

విశా— (సుశీలతో) సోదరీ! నావాగ్దత్తము చెల్లించితినిగదా! వత్స
క్షమావల్లభా! నేనన్నమాట నిజంబేనా?

సుశీ— సీ॥ అలకిరాతులచేత♦నడవిలోఁజిక్కిననన్నుగాపాడిన♦యన్నవీవె

వత్స— భానుమంతునిపుర♦వరముననన్నుగుర్తించినయట్టిసు♦ధీరవీవె

సుశీ— పతిఁబాసిఘనదుఃఖ♦వార్ధిలోమునిగిననన్దరిజేర్చిన♦నావవీవె

వత్సనతి జాడలఁ దెల్పి♦సత్వరంబునసంతసంబానంగినగృపా♦శాలిపీవె

సుశీ—— తే॥ గీ॥ అంచితానంద వార్థిలో♦ముంచినట్టి
సుగుణగణనీయుడవునీవె♦సుమ్ముదలఁప

వత్స—— ఏమియుపకృతి సల్పుదు♦నెంచిచూడ

సుశీ—— నెన్నఁగానొక్కదండమే♦యన్ననీకు॥

విశా—— విశ్వంభరారమణా! మీయిరువురనుబ్రచ్ఛన్న వేషంబులతో మాయాస్థానంబుఁ జేర్చినందుకు క్షమింపఁ గోరెద. నాకు సరసాంగియను సోదరీతిలకం బొండుగలదు. ఆమె నిన్నుదప్ప వేరొకనిఁ జేపట్టనని దీక్ష వహించి యుండ, మీరురాజ్యంబెల్ల వీడి నిజకాంతాసమేతులై యరణ్యంబులకేగితిరని విని మీజాడలనరయుటకు చారులఁబంపితిమి. కాని యెచ్చోటను గానుపించ లేదు. ఇట్లుండ నేనొక్కనా డరణ్యంబున కేగి కిరాతుల చేఁజిక్కి కడుఁబరితపించుచున్న యీసుశీలంగాంచి కిరాతులం దరిమి యీమెను ప్రచ్ఛన్న వేషంబున ధీమణిసౌధంబున కేగుమనియు, మిమ్ము నేనరసితోడ్కొనివత్తుననియుఁ జెప్పితి. భానుమంతునిపురంబునందుమిమ్ముఁగాంచి సుశీలయిక్కడనున్నదిమొదలగుసంగతులం దెల్పకమునివేషంబునరాజసభ కేగుమనిమీకు జెప్పితి. ఇందుకుక్షమింపఁగోరెద. మాయందుఁగృపఁబూనినీపై మనంబు నిల్పియున్న మాసరసాంగిని వివాహంబొడ మాకుఁ గీర్తి దెమ్ము.

గోపా— శా॥ ధీసంశోభితమైననాసుతను పార్థింప నీకు నేనిచ్చుటల్
వాసిం బెండిలిగూర్పఁగా మనములో భావించియున్నాడనే
లాసందేహము బొందెదీవు సుగుణాలంకార యోషామణిన్
నాసత్పుత్రిని వేగగైకొను మిఁకన్ క్ష్మాపాలచూడామణీ॥

వత్స— రాజచంద్రా! రాజ్యభ్రష్టుఁడనై యడవులఁ గడునిడుమలు గుడుచుచున్న నాకీపడఁతి యేటికి?

గోపా— వత్సేశ్వరా! కడచినదినంబులఁగూర్చి చెప్పనేల? యిప్పుడు భవదీయ రాజ్యంబరాజకంబుగనున్నది. నీవేగి నీరాజ్యంబును గైకొని సుఖంబుగఁ బాలించవచ్చు. ఆహా! నీవెంత నీతిపరుఁడవు! మామతోఁ గయ్యంబాచరింప వలయునని గదా నిజాంగనా సహితుండవై యడవులకేగితివి!

పౌరులు ప్రవేశించి) హేరాజేంద్రా! శ్రీనికేతన పురాధిపతి మా వత్సరాజును వెళ్లఁగొట్టి రాజ్యంబు స్వాధీనముజేసికొనఁ బ్రయత్నింపగాఁ పౌరులందఱును గలిసి యాతనిని రాజ్యంబులోని కడుగుఁ బెట్టనిచ్చినారు కారు. ఇప్పుడు రాజ్యంబరాజకంబుగానున్నది. వత్సరాజు నెమకుటకై యనేకులు పౌరులరిగినారు. ఇప్పుడు వత్సభూపతి మీకడ కేతెంచినాడని కొందఱివలనవిని వచ్చినాము. (వత్సరాజుంజూచి) ఇదుగో! యిదుగో! మారాజు గారు. బాబయ్యా దండములు. రాజ్యంబరాజకంబుగానున్నది. తమరు దయచేసి ప్రజల రక్షింపుడు.

వత్స— పౌరులారా! నేను నేఁడో రేపో పురమున కేతెంచెద. మీరిఁక నేగుడు.

గోపా— వత్సభూపా! నాకల్లుండవై మావంశంబునకుం గీర్తి దెమ్ము.

సుశీ— నాథా! వీరి కోరిక నంగీకరింపుడు. సరసాంగి సుగుణముల పేటి యనిపింటి. సందియం బందకుఁడు.

వత్స— విశ్వంభరాకళత్రా! పెద్దలమాట కెదురాడనేర్తునా?

పౌరు— బాబయ్యా! త్వరగా రాగోరెదము. మేము పోయి వచ్చెదము.

గోపా— (పౌరులతో) పౌరులారా? మీరిఁక నేగుడు. మీ రాజుగారు వివాహంబైన వెంటనే పురంబున కేతెంతురు. (విశారదునితో) కుమారా! భూసురోత్తములను రావించి లగ్నంబు నిశ్చయించి వివాహం బాచరింతము. ఇఁక మనము వివాహప్రయత్నములలో నుండవలయును. రండు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



(చతుర్థాంకము సంపూర్ణము)